శ్రీరస్తు

# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

పదియంకముల నాటకము.

ఇయ్యది

కొమరిపాలెం వాస్తవ్యులును

గుల్బకావలి, మువ్వాజిరి, ప్రతిజ్ఞాపాండవము, ప్రతిజ్ఞాయాదవమాది

గ్రంథకర్తలగు

మ. రా. రా. అయినాపురపు సుందరరామయ్యగారిచే

రచియింపఁబడి

నేలకంటి భావనారాయణరావుచేతను,

కర్రి అచ్చయ్య అండ్ సన్సుచే

ప్రకటింపఁబడియె.

మూఁడవకూర్పు 1000.

కాకినాడ.

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

1919




## ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

### పురుషులు.

ప్రభాకరుఁడు—రత్నగిరిరాజు.

జయచంద్రుఁడు—ప్రభాకరునికుమారుఁడు, కథానాయకుఁడు.

మతిమంతుఁడు—సత్యసేనుఁడు—ప్రభాకరుని మంత్రులు.

జనార్దనసింగు,— నారాయణసింగు—ప్రభాకరుని సేనాధిపతులు.

దుశ్శీలుఁడు—ప్రభాకరుని పినతండ్రి కుమారుఁడు.

దుశ్చేష్టుఁడు—, దుర్బుద్ధి—దుశ్శీలుని ప్రాణమిత్రులు.

సుశీలుఁడు—సుశీలులతోఁబుట్టువు,—వింగ్లకు రాజు.

చిత్రశర్మ—సుశీలుని మంత్రి.

నారాయణశాస్త్రి, వేంకటశాస్త్రి—ప్లీడర్లు.

మానవవర్మ—వింగ్లనివాసి, క్షత్రియుఁడు.

దేవగుప్తుఁడు—మానవవర్మయొక్క సాక్షి.

### స్త్రీలు.

సుశీల—ప్రభాకరుని భార్య.

చంద్రరేఖ—ప్రభాకరుని కూతురు, కథానాయిక.

చిత్రరేఖ—మానవ వర్మ భార్య.

కమల—మానవ వర్మయొక్క ప్రథమభార్యకుమా

రేవతి—చిత్రరేఖకుమార్తె.

సుందరి, రోహిణి, శ్యామల, మణిమాల—కమల రేవతుల యొక్క నర్మ
[మణు

చంద్రమణి—సుశీల దాసిగా యుండినప్పుడు పెట్టుకొన్న పేరు.

☞ ఇంకను కథాసందర్భానుసారముగ జాలరివాండ్రు బోయిలు వాటికొండ
స్త్రీలు యాదవీరులు ప్రవేశింతురు.



# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

నాంది.

ఉ. శైలధ్వనింపఁగాచతతి ♦ గిల్కనిమోగఁగ గంతహారముల్
బాళినటింపఁజన్మోన్నల ♦ హైసరిదండలకుచ్చులోర! యూ
గాడనితంబముల్ కవును ♦ కవ్వము చేదధిజిల్కుచుండ ముం
గాలనుబట్టి "స్తన్యమొసఁ ♦ గమ్మరొ!" యంచును గారమాడుగో
పాలుఁడుభక్తపాలుఁడు కృ ♦ పామతిసభ్యుల కిచ్చుకోరికల్ 1

(నాంద్యానంతరమున సూత్రధారుఁడాకసము వంకఁజూచి)

సూత్ర—అహా! నేటికి నాజన్మసార్థకమయ్యెఁగదా. ఆశాభూజము ఫలించినది. సమస్త విద్యాచాతురీధురీణులగు నీసభాసదుల యనుజ్ఞపడసి నాటకమాడఁ గడంగెదను. ఏకార్యమునకైన నొకరికొకరు తోడుండిన ననాయాసముగా నెఱవేఱునని యార్యులుపల్కుచుందురు. కావున నాప్రేయసిని బిలిచెద. (అని తెరవైపుఁజూచి) ప్రేయసీ! అలంకరించుకున్న పక్షమున నిటురమ్ము.

నటి—(తెరలో) ఇదిగో వచ్చుచున్నాను. (ప్రవేశించి నమస్కరించును.)

సూత్ర—కల్యాణంభవతు.

నటి—నాథా! నన్నుసభకుఁ బిల్వకారణమేమి?

సూత్ర—సఖీ! నేటిదినంబున వృత్తవైచిత్ర్యముగలిగి కరుణరసమువెల్లిగొల్పెడు నాటకముఁ బ్రదర్శింపఁబడునని విని దానినిసన్మానింప సభ్యులు విచ్చేసియున్నవారు. అయ్యది నెఱవేర్ప నాకు సహాయురాలవు వగుదువని రావించితి.

నటి—ఆర్యా! ఇచ్చటనెద్ది ప్రదర్శించెదరు?

సూత్ర—సహచరీ! నీవెఱుంగవా? యెఱుంగకున్నఁ జెప్పెద వినుము.

క. అయిదాపురనివాసుఁ ♦ డయినాథురాన్వయుం, డలరు భరద్వాజ ♦ కులభవుండు
సార్వసమ్మతుఁడింపు ♦ వమ్మురసంభావుండు, [illegible]

నమ్మహాప్రియురాణి ♦ యరవిందమృదుపాణి, సుగుణమణికదంబ ♦ సుందరాంబ
వీరలకొమరుండు ♦ విబుధవిధేయుండు, శైవసుందరరామ ♦ యాఖ్యసుకవి
భువనతఁజెందిన భారతీ ♦ కథలయందు లాలఁగోహర్షవఁబరగు ♦ జాలి కతను
గడఁగిజయచంద్రచంద్రరే ♦ ఖావిజయమనంగరచియించెనాటకం ♦ బాంధ్రమునను.

పఙ్క్తివృత్తము. ఆడుదమిప్పుడున్, బాడుద మెంతో -
వేడుకగోరన్, శేఁడుజనంబుల్. 3

నటి—ప్రియా! ఈకవి యందఱిని మించినవాఁడయినాఁడే!

సూత్ర—ఏమటులఁ బల్కుచుంటివి?

నటి—ఉ. కొందఱు భారతాదులను ♦ కూర్మిదలిర్పఁగ నొప్పుగాథలన్
కొందఱు పౌరాణభాషఁగల ♦ గొప్పకథల్ తమివ్రాయుచుండ వీ
రందరికన్న మించి ముద ♦ మందఁగఁ భారతిభాషసత్కథల్
బొందుగనాంధ్రమందు బుధ ♦ పుంగవులెన్నఁగవ్రాయువింతయా. 4

సూత్ర—ఔనౌను. నీవు చెప్పినది నిజమే.

నటి—ఆర్యా! నాకింకొక్క సందియము పొడముచున్నయది.

సూత్ర—అదియెద్ది?

నటి—ఉ. బాలుఁడునిర్వదేండ్లుగల ♦ ప్రాయమువాఁడు సతంబుసత్యసం
శీలుఁడు నార్యసన్నుతుఁడు వి ♦ శేషయశోవిభవుండు వేడుగో
పాలకృపన్ గవిత్వపరి ♦ పాటి జెలంగెడువాఁడు నాతఁడే
లీలగ మెచ్చుగొల్ప నవ ♦ లీల రచింపఁగ గల్గెదీనినిన్. 5

సూత్ర—ఓసీ! పిచ్చిదానా? ఇదియా యింక నెద్దియోయని యాలోచించుచుంటిని. కానసందియమేల? వినుము.

ఆ. వె. ఎంచ దీపకళిక ♦ యించుకదైనను
నీకాంతి యిల్లునిండ ♦ క్రిమ్ము భంగి
కవియు బాలుఁడైన ♦ గవితచాతురివొసె
యిందుకేల నీకు ♦ సందియంబు. 6

నటి—సఖా! నా సందేహము తీఱినది. సెలవు తీసికొని తగిన పాత్రములను సమకూర్చెదను.

సూత్ర—చెలీ! మంచిది. మనము ప్రదర్శింపఁబోవు నాటకమునకు ముందు ఋతువర్ణనసేయుము.

నటి—దేవా! ఏఋతువు వర్ణించును?

సూత్ర—ఎల్లసుఖములనిచ్చు వసంతఋతువును వర్ణింపుము.

నటి---చిత్తము. లయగ్రాహి.

కాంత లనిశంబునిజ ♦ కాంతులనుగోరితమి
నెంతయును సౌరభల ♦ తాంతవనకేళీ
స్వాంతు లగుచుండ నిరు ♦ చెంతలనికుంజకుజ
సంతతులుగీరముల ♦ వంతముగఁ గూయన్
దంతశతదాంతరద ♦ జంతుఘలదంతికద్ర
వంతిముఖభూజములు ♦ సొంతముగఁ బూయన్
వృంతములు గల్గిన ల ♦ తాంతములుతీవెలున
సంతునికిఁ బేరులుగ ♦ వింతచెలువొప్పన్. 7

సూత్ర—ఆహా! కల్యాణీ! త్వదీయగాన మాధుర్యము సకలజనోల్లాసముగా నున్నయది. అదియునుంగాక.

తే. గీ. సఖియనీ గానషడ్జమ ♦ స్వరము వినఁగ
ఉలఁకి దర్వీకరంబులు ♦ తలలువంచి
ప్రాణరక్షణకొఱకునై ♦ పరుగు లిడుచు
వెలవగనలేక పుట్టలో ♦ నిలచియుండె. 8

నటి—నాధా! నన్నీసభామధ్యమందిట్లి నిరసనజేయుట భావ్యమేనా?

సూత్ర—ప్రేయసీ? నీ వెటులఁ దలంచితివి,

నటి—ఆర్యా! "శిశుర్వేత్తిపశుర్వేత్తివేత్తి గానరసంఫణీ" అని శాస్త్రమేకదా. ఇప్పుడు నా సంగీతనైపుణ్యమునకుఁ బాములు తలలువంచి పుట్టలలోఁ జొచ్చెనని పలవిచ్చుటఁ బాడఁగా, (———)

సూత్ర—ఓసి వెఱ్ఱిదానా! "షడ్జమ్ మయూరో వదతి" అని సంగీతశాస్త్రము తెల్పుచున్నయది. అనఁగా షడ్జమ స్వరము నెమలికూతవలె నుండును. మయూరములకు ఫణులకును విరోధము గాన నా కూత వినఁగానే ప్రాణభయము కలుగునేమో యని సర్పములు పుట్టలయందుఁ జొచ్చెను. కాన నట్లంటి.

నటి—నాధా! కేకియందు సౌందర్యమున్నదిగాని గానమింపుకరమైన విన సొంపుగా నుండునా?

సూత్ర—నవ్వటాలకుఁ బరిహసించితిని.

నటి—ప్రాణేశా! నేటిదినమున రత్నదేశ నివాసు లత్యంత కుతూహలమగ్నమానసులై యుండుటకుఁ గారణమేమి?

సూత్ర—ప్రేయసీ! తే. గీ. ప్రజలసేమంబరయఁగా ♦ ప్రభాకరుండు
తనదుప్రియపుత్రితోఁ రాగ ♦ తనయుతోడ
మంత్రిరాయుగ్మంబుభటులుసా ♦ మంతులాది
కొలువఁగొలువలోనికిఁజన ♦ దలఁచిరబల 9

నటి—ప్రియా! అయ్యది రాజులకు ధర్మమే. అందులకయి యీప్రజలకింత యానందమేల.

సూత్ర—ఓసీ! వారిదుర్దశ ప్రభునితో మనవిఁ జేసుకొన్న దానికిఁ దగిన సదుపాయముఁ జేయుదురు. ఇదిగాక యానృపుని పితృవ్య పుత్రుండగు దుశ్శీలుని దుర్వర్తనంబులుఁ జెప్పి శిక్షవిధింప వేఁడుకొందురు. దానివలన యూరివారలు మిక్కిలి సుఖముగా నుండెదరు.

నటి—సఖా! అటులైనచో మనమిచట నిలుచుట కర్జంబుకాదు పోదము రండు.

సూత్ర—మంచిది.

(అని యిర్వురు నిష్క్రమించుచున్నారు.)

ప్రస్తావన ముగిసినది.



యీపై ప్రస్తావన కొందరు గ్రామవాసీయుఁడున్ను, అయినాపురపు సుందరరామయ్యగారి ప్రియస్నేహితుఁడున్ను, అయిన నబ్బెళ్ళ రామిరెడ్డి వలన వ్రాయబడినది.



# లాల్ గోహారు,

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## ప్రథమాంకము.

[ప్రభాకరునికోర్టు.]

(ప్రభాకరుఁడు తన కుమారుఁడగు జయచంద్రుని, కుమార్తెయగు చంద్రరేఖను,నిరుప్రక్కల నిడుకొని మంత్రి సామంతాది జనంబులను, భటులును, గొల్చుచుండ, మంత్రులను జూచి)

ప్రభా—సచివాగ్రణులారా? మనపురజనులందఱును,

సీ. సంసారములతోడి ♦ సంపదలనుగూడి, సుఖముగావర్ధిల్లుచుండిరిగద
వంశానురాగులై ♦ వర్ణాశ్రమవిధుల, నందఱుహాయుగొల్చు ♦ చుండిరిగద
పాడిపంటలఁగల్గి ♦ వైరంబులేకుండ, నిండుధర్మపరత ♦ నుండిరిగద
జారచోరదురావ ♦ చారముల్ లేకథ, యాత్ప్రేమముల్వీడి ♦ యుండిరిగద

మఱి—గీ. దైవమనుకూలుఁడైమన ♦ దళినిఁజేగనరులుమనరాజ్యమందువఁ ♦ జోరుటదెట్లు
సర్వశక్తుల ప్రభువరు ♦ లుర్విఁజేల మహికిఁగొదవేలఁ గల్గునో ♦ తూనవేంద్రి.1

సత్య—రత్నగిరీంద్రా! తమతో సైద్దియో మనవిఁ జేసుకొనుటకు పురజనులు నిచ్చేటి యున్నవారు.

[ఒక వైపునుండి పరిజనులు ప్రవేశించుచు.]

హిందూస్తానిరాగం.

భూపతియీపురమందున । కాపురమేపారగ వీదేశాదమా।
కాపాడావే । పాపము మే మాగగ లేమి కరియున్నన్నా॥ భూప॥
దేవర యేమని పణిగాంపము । వీయనుజుండు పెట్టెడుబాధులను।
మత్సరమో । యుత్సవమో । దైవమెటింగెడు సత్యమయ్యో॥ భూప॥
అతనిదుష్కృతి । కృత్యములెంచుట । మాతరమగు వనితలంచము।
భూతలనా । ధాతనిపని । ధాతయెఱింగెడు నా హావా॥ భూప॥
ఈతుణమాతని । పతుముమానిక । శిక్షించరించితి।
రక్షింపవలె । కతియమెన్నగు । కతులకేగెద మకటకటా॥ భూప॥

కొండ—అర్యా! కం. కలిమినిబలిమిని నీకీ
బలుమీసములేలయంచు ♦ బట్టికటాయు
ఝ్యాలులూగంగ వ్యధకోర్వక్
నిలుపోవక నెట్టంగినిసి ♦ నిర్దయమోదున్. 3

పరిభా—అహా! యెంతదుర్మార్గత.

మతి—అతఁడుచేయు దుష్కార్యములలో నిదియొకకార్యమా?

కొండ—మానవేశా! మేము తమ దర్శనమునకు వచ్చుచుండ దారిలో.

క. జవరాలొక్క- తెగనితా, జవమునవెదుకేగినిల్చి ♦ చానా! నవలా!
నవులాటగాదు నాతోఁ, గవయుమని జవిరి పరుగిడెఁ ♦ గతినాత్మంబై. 4

పరిభా—హరిహరీ [అని చెవులు మూసుకొనుచున్నాఁడు.]

మాదు—రాజశేఖరా! నిన్నసాయంకాలమున యాదుస్సీల్షుఁడు.

మత్తకోకిల. కళ్ళుఁగానక మేనెఱుంగక ♦ గట్టుపుట్టనులూడఁగా
మెల్లమెల్లనధూలుచుంబడి ♦ మెల్లమెల్లగ లేచియుం
దల్లనల్లన పోవుపాంథుల ♦ నడ్డగించుచు మోదునో
కల్లుచేఁగద యీమహత్వము ♦ కల్గె వానికి భూవరా. 5

పరిభా—అన్నన్నా! యేమివానిమాహాత్మ్యము.

నాల్గ—మనుజాధిపా! నేటికి నాలు దినాలక్రిందట కొందఱుమందయానలు
మందర మందగమనంబుల నొంటరిఁ బోవుచునందందహా యొక కుం
దరదనముందు తేగి, మరుజందడికి తాళఁజాలనని చిటికెలు వైచుచు.
కం. ఇదివరకెఖుని ♦ కెందరిగాంచును, నిందునిభాస్యల ♦ నీటునసీ

మదితను బోలిన * మోహనరూపము, ముద్దులగుమ్మను * మున్నెపుడున్
గదియఁగలేదని * కాగిటఁజేర్చి వి, కావికనవ్వుచు * కాంతను తా
నదిమినవెన్కటి * యబ్జముఖు ల్భయ, మందిరియమ్ముల * మర్త్యనృపా. 6

పరిభా—అహా! యెంత క్రూరకృత్యము.

అయి—రాజా! బాలిందిసీసాను శిరంబట్టుకొని తెలివున కష్టముగానిలువఁ
బడి నాట్యముఁ జేయుచు,

ధువ. నుం. చక్కపగడది ♦ సతియటన్నను ♦ జచ్చునీదగుకాయమనే
డొక్కడచ్చిని ♦ యక్కడంచెద ♦ యొక్కనిమిషములోనల
గ్రక్కఁజూడమి ♦ జేతీవంచ ♦ యొంచుమాటంచుతనకున్
బ్రక్కనేగుడు ♦ వారలం గని ♦ బట్టివెంటను తఱుమునో. 7

పరిభా—ఇసీ! యెంతదుర్మార్గము.

అర—భూపతులావతంసా! మార్గమున కొకప్రక్కగాఁ గూర్చుండి యిటునటుఁబో
వుప్రయాణికులం బిల్వ నారంభించినవారలు.

చ. పిలచినఁబల్కనేను నిను ♦ బిల్వగలేదను పట్టికొట్టఁగా
బలుకక యూరకుండునెడ ♦ బల్కవుపిల్చిన గర్వమాసరే
నిలు వెటుబోదువంచుఁబడ ♦ నిట్టిశిరంబున మోదుగట్టిచే
పరి—చిలిపతనంబుఁజూడఁగ వి ♦ చిత్రముగాదొకొ యెట్టివారికిన్. 8

ఏక—అధిపా! “పిల్లికిఁ జెలగాటము, ఎలుకకు బ్రాణసంకటము” అనురీతి దమబో
ధకులకు విచిత్రముగాని, మాయట్టి యల్పులకు దర్శనాశనమే కాకుండ మాన
ప్రాణభీతిగా నున్నయది. ఎట్టిలన సిగ్గవిడనాడి చెప్పెద.

సీ. ఆరామమందున ♦ నా రామతోఁగూడ, నిదురింప నడురేయి ♦ నదిరిపడిలేచి
ప్రాకారమధ్యంబు ♦ నేకాంతముగదాఁటి, పర్యంకశయనయౌ ♦ పంకజాక్షి
పైబడనుంకప ♦ భామయు బెగడొంది, దిగ్గున మేల్కాంచి ♦ సిగ్గువిడిచి
కన్నులెఱ్ఱగఁజసి ♦ మిన్నగిరెట్టు, కూఁకలు వేయంగ ♦ గుండెలవిసి

తే. గీ. లేచునంతఁ జేడవ్రలు ♦ నాఁచుకొనగ
గనిపిపైబడఁ బావలా ♦ దనమెుసర్చిఁ
త్రోసిఁప్రాణావశిష్టుఁగఁ ♦ జేసిపారె
పరిభా—కష్టయిటువంటివానిపైఁ ♦ గరుణయేల. 9

ఏని—ఓనరపతీ! మనుజుల సంగతి యటుండఁగా నోరెఱుంగని చతుష్పదజంతువుల
జోలి దైవము గనికరము లేదు.

చ. ఖరముఖకదానిఁబట్టుకొని ♦ కాళ్ళకుఁ దోకకుయాకులన్
సరగునఁగట్టినిప్పునిడఁ ♦ జయ్యన మంటలు గ్రమ్మి మేనుపైఁ
జురజురఁ బొక్కులెత్త వ్యథఁ ♦ బొందఁగఁ జాలక పారిపోవఁగాఁ
గరములు తట్టుచున్న గను ♦

పరిభా— కట్టిడికార్యము లెట్టు చేసగున్. 10

తోమిత్ర— ఓమర్త్యాధిపా! జంతువులసంగతి యటుండఁగా నెంతకఠినాత్ములకైనను బిల్లలనినచో నుల్లము కలుఁగక మానదుకదా! అట్టిపసికూనలు.

ఉ. బారులుగట్టిపాటలను ♦ బాడుచు నాడుచు నుత్సుకంబుతోఁ
దీరుగఁ బోవువారిగని ♦ తీవ్రముగాఁదరిఁజేరఁజేరి ని
ష్కారణమైన నేరమును ♦ గల్పనజేసి యకారణంబుగా
గారడిబుద్ధిమోదు
గని ♦ కారముఁ జెందని జన్మమేలకో. 11

పది— ఓరాజశేఖరా! వేయేలా, యాదుష్టులుని శిక్షింపకుండిన.

తే. గీ. కాపురంబులు విడనాడి ♦ కానకేగి
ఫలములు తినినైన ♦ బ్రతుకవచ్చు
నెంత సిరియున్న నీలాటి ♦ పంతలకట
యనుభవింపగ శక్యమే ♦ యాజునికైన. 12

పరిభా— [మింటివైపు జూచుచున్నాఁడు]

ఒకస్త్రీ— రాజా! "రక్షించురక్షించు" (అని రాజుముందు నిలుచును.)

[రాజాశ్చర్యము నభినయించుచున్నాఁడు]

[మనుష్యసంఘము నిబ్బరపాటితో నొకవైపున నిలువఁబడియుండెను.)

దుష్టు. (తెఱలో) మత్త. "బాలరో యిక పారిపోతిని ♦ బాగుబాగని" యెంచకే
వీలుగాదని యూరకుంటిని భీతిచేతను గాదె భూ
పాలుఁడుండిన వాకిలత్స్యమె ♦ బట్టకుండిన నెట్లు దు
ష్కలుఁడంచును బిల్వబోకుము చేడిరో! యిదియెట్టుగా.
[అని వెనుకకు బోవుచున్నాడు.]

స్త్రీ— [విచారముతో] దేవా! మీపినతండ్రి పుత్రుఁడొనరించు దుష్కృత్యములఁజూచి యూరకుండుట తమబోటి సాధు సజ్జనులకు ధర్మమా? మాయట్టి పతివ్రతల కర్మమా?

పరిభా— ఆహా! ఏమి వీనిదౌష్ట్యము?

మతి—నృపశిఖామణీ! వీరిమాటలు పాటిసేయక యూరకున్నను, నిప్పుడు నిదర్శనము
గాఁ జూచితిరిగదా.

పరిభా—సచివాగ్రణీ! యాతనిసంగతి యిదివఱకే యెఱుంగుదును.

సత్య—(రాజునుద్దేశించి)

ఉ. భూపకులాగ్రగణ్యా! గన ♦ భూజనపుణ్య పరాక్రమక్రమా
టోపభుజాబలాఢ్య సుగు ♦ణోజ్జ్వల సుందర మూర్తి! యొల్లడన్
వీపినతండ్రి యాత్మజుఁడు ♦ మేదినిపై నొనరించు దుష్కృతుల్
శ్రీపతికైన లెక్కఁగొన ♦ జెల్లునె! సర్వము నిండియుండినన్.

చేయియన నేల? జారచోరగుణంబులం దాఁటితేఁటి వేఁట పాన జూదంబులకు మేటియై
మన్నుమిన్ను గానక వర్తించుచున్నవాఁడు. కావున యీ పేష్కంజేసి శిక్షయొనరిం
పకున్న, నాతని దౌర్జన్యమును మనము వృద్ధిఁబొందించినవారమగుదుము. అదియు
నుంగాక మన కాతనివలన ముందెద్దియైనను గీడు మూడక మానదు.

పరిభా—(కుమారునివంకఁ జిలికించి) కుమారా! యిదివరలో మనదుశ్శీలుని చెడునడ
తలను సహించి యూరకుంటిని గాని, యంతకంతకు వానిదుర్జనత్వము హెచ్చగుచు
న్నయది.

ఉ. ఈతని జంపనామదికి ♦ నెంతయు నిష్టములేదుగాని యీ
రీతినియూరకుండుసెడ ♦ శ్రేయము గాదు ప్రజాళికెంతయున్
భీతియొకింతలేక గడు ♦ చేరిజవృత్తిఁ జరించుచుండు నీ
పాతకి జంపినంగలదె ♦ పాపము నేఁడు కుమారశేఖరా. 15

అయినను యుష్మదభిప్రాయంబు నెఱింగి మెలంగువాఁడ. దీనికర్తవ్యంబెద్దియో యా
లోచింపుము.

జయ—పెద్దలు తమరును, మంత్రులు నుండఁగా నాకుమాత్రము తెలియునా? అ
యినను, తే. గీ. సంకెలలువేసి మన చెర ♦ సాలయందు

నుంచి మతిబుద్ధిరా విడిపించవచ్చు
గాని యిట్టిదుర్వాదులు ♦ కరచుకిముట
ధర్మమనుచును దలఁపనో ♦ తండ్రి నేను.

పరిభా—బాలకా! నీవు చెప్పినది బాగుగానున్నది. (అని భటులవైపు జూచి) ఓరీభ
టులారా! తే. గీ. ఎల్లి యాతనికడకు మీ ♦ రేగిఁబోయి

బట్టి పంకెలలను వైచి ♦ కొట్టుకోవఁ
బెట్టియావల సభకును ♦ వేగిరముగ
రండు తేకున్న మిమ్ముల ♦ గండడంతు. 17

భటులు—చిత్తము స్వామీ. (అనిపోవుచున్నారు.)

ప్రభా—(ప్రజలపైఁ జూచి) ఆతని రేపటిదినమున గారా గృహబద్ధునిగాఁ జేయుచున్నాము. మీమీ నివాసములకుం బొండు.

ప్రజలు—చిత్తము మహారాజా! తమబిడ్డలము మమ్ము నేలాగు రక్షించెదరో!

(అని సంతోషముతోఁ బోవుచున్నారు.)

(స్త్రీయును వారి వెంబడి నిష్క్రమించు చున్నది)

ప్రభా—మంత్రిపుంగవా! యింక నేమైనా తగవులు కలవా?

(అంత నొకభటుఁడు ప్రవేశించి)

భటు—మహారాజా! తే. గీ. భామలిద్దరు గాంచంగ ♦ బాలునొకని
వెంటబెట్టుక యీసభా ♦ మంటపమున
కావలిద్వారమందు మీ ♦ యాజ్ఞకొఱకు
నిలచియున్నార లాజ్ఞయే ♦ కొలువుఁజేర.

ప్రభా—ఓరీ! త్వరితముగా నిటుఁదోడ్కొనిరమ్ము.

భటు—చిత్తము. (అనిపోయి యిరువురుస్త్రీలతోను అయిదు సం॥ ల వయస్సుగలబాలునితోను ప్రవేశించుచున్నాడు. పిల్లవానిని మధ్యనిలిపి స్త్రీలిద్దఱు చెరియొకప్రక్క నిలువఁబడినారు.)

ప్రభా—ఇదియేమిటి?

మొ-స్త్రీ—దేవా! యీతడు నాకుమారుఁడు.

రెం-స్త్రీ—రాజా! యీతఁడు నాపుత్రుఁడు.

ప్రభా—ఆపిల్లవానిని మీరిద్దరు నొక్కసారిగఁ బిల్వుఁడు చూతము.

మొ-స్త్రీ—పంక్తివృత్తము. చిన్నికుమారా ♦ యెన్నడినిత్తున్
వెన్నయుబాలున్ ♦ దిన్నగరమ్మా. 19

(అనిపిల్వఁగానే యామెయొద్దకుఁ బోవుచున్నాఁడు.)

రెం-స్త్రీ—సురలతావృత్తము. మురుగులుగొల్సల్ ♦ యరయఁగనీకున్
పరగునవిత్తున్ ♦ వరగుసరమ్మా. 20

[ఆమె వద్దనుంచి యీమెవద్దకువచ్చి తిరుగ మధ్యను నిలుచున్నాడు.]

ప్రభా—(ఇంచుక నేపాలోచించి) వత్సా! నీబుద్ధికుశలతఁ జూడవలెనని యున్నది కావున నీతగవుఁ దీర్పుము.

జయ—చిత్తము. (అని భటునికేసిఁజూచి)

విభూతి. నిల్వకుండపొమ్మికన్ ♦ పల్వురుండఁగాసభన్
పిల్వ మొక్క నూనరిన్ ♦ కొల్వులోనికిప్పుడే. 21

భటు—చిత్తము. (అని నిష్క్రమించి తలారితోఁ దిరుగఁ బ్రవేశించును)

తలా—నమస్కారముస్వామీ ! ఏమిశలవు?

జయ-రుగ్మ. ఓరితలారీ ♦ యొయ్యనబాలున్, చేరి కఠారిన్! ♦ జీల్చుము వేగన్
పొరుదలిర్పన్ ♦ సభ్యులు మెచ్చన్, వారికొసంగన్ ♦ వాదముతీరున్

చంద్రి—అన్నా! ఏల? నిష్కారణముగా బాలునిఁజీల్చి సానతిచ్చెదవు?

జయ—అమ్మా! నీకు తెలియ దూరకొమ్మ!.

తలా—చిత్తము దేవా! (అని నఱకఁబోవుచున్నాఁడు)

మొ-స్త్రీ—అ, అ, అ.

[అనితలారియొక్క ఖడ్గమునుబట్టుకొని జయచంద్రునితో విచారముగా]

ఉ. బాలుని జంపఁజేయు టెటుఁ ♦ బాల్పడు నక్కట నాకునిప్పుడీ
బాలునిలోన నిట్లు నగ ♦ పాలు నొసంగఁగవద్దు దానికీ
మేలగు నిచ్చినం బ్రీతికి ♦ మేదినిపై తిరుగాడుచున్నచోఁ
జాలమనంబునం దెపుడు ♦ సంతస మొందుదు రాజశేఖరా. 23

జయ—[అలాగు వచించు మొదటిస్త్రీనింజూచిసంతోషముతో]

మృగీవృ. బాలకో ♦ మేలుగా, బాళితో ♦ బాలునిన్. 24
ఇచ్చితిన్ ♦ మెచ్చితిన్, జెచ్చెరన్ ♦ బుచ్చుకో. 25

మొ-స్త్రీ—మహాప్రసాదము. (అని బాలునియెత్తుకొనుచున్నది)

జయ—[రెండవస్త్రీపైపుఁజూచి కోపముతో] ఓభటులార!

తే. గీ. సంకెలలువేసిదీని ని ♦ శ్శంక లేక
యుంచుడీ చెఱసాలయం ♦ దించుకయును
జంకులేకను మాయొద్ద ♦ బొంకులాడ
నెంతకైనను నెఱజాణ ♦ వింతినీవు. 26

భటు—చిత్తము. (అని యామెను దీసికొనిపోవుచున్నారు.)

మొ-స్త్రీ—రాజా! నాకుఁ బుత్రదానముఁజేసినారు. మీకు వెక్కువందనములు. సెల
వొసంగితిరేని పోయెద.

ప్రభా—మంచిది.

(స్త్రీ నిష్క్రమించుచున్నది.)

చంద్రి—నాన్నగారు! సాయంసంధ్యా సమయము కావచ్చినది సెలవొసంగితిరేని యీ ద్యానవనమునకు కేళీవిహారార్థమై బోవ నుద్యుక్తురాలనై యున్నాను.

పరిభా—(ఆమెను ముద్దుపెట్టుకొని) అమాత్యరత్నములారా! నేటిదినము తగవుల తీర్పులచే కాలయాపన మైనది. రేపటిదినము దేశక్షేమ మరయుదము. మనము కూడ నుద్యానవన విహారార్థమై పోదమురండు.

మంత్రులు—మంచిది.

(అవి నిష్క్రమించుచున్నారు.)

తే. గీ. ధాత్రినయినాపురపు వంశ ♦ ధార్మికులగు
సోమసుందరాంబల ♦ ప్రియసూనుఁడై
యలఘుసుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది ధాత్రిపై ♦ వరలు గాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## ద్వితీయాంకము.

---

### ప్రథమరంగము.

[రత్నగిరిపురము వెలుపలబయలు, సారాపాకనుండి దుశ్శీలుఁడు, దుర్బుద్ధి సారాసీసాల నొకచేతి నుంచుకొని ప్రవేశించుచున్నారు.]

దుశ్శీ—(సారాసీసాను చేతిలోఁ బెట్టుకొని)

సీ. ఇయ్యదియేకదా ♦ నెయ్యము క్షణములో నొనగూర్చుటకు మంచి ♦ యనుఁగుమందు
ఇయ్యదియేకదా ♦ కయ్యమం దెటువంటి, శూరుల నెదిరింప ♦ ధీరుబంటు
ఇయ్యదియేకదా ♦ యెట్టివాఁడైనను, జారచోరతకును ♦ కూరిమి చెలి
ఇయ్యదియేకదా ♦ చయ్యన మోక్షంబు, పొసఁగఁజేయుటకు న ♦ మ్ముక్తిపథము
బుద్ధి శాసిని జన్మంబు ♦ గడ్డిపరక లోటిదైనను సరిగాదు ♦ తులువులకట
దీని నిందింప నెంతురు ♦ మానసమున నట్టివారల కుండునే ♦ పుట్టగతులు. 1

[అని తిరుగ త్రాగుచున్నాఁడు.]

దుర్బు—అన్నా! దుశ్శీలా!

చంప. ఆరయ రేయు శేఁయి దేటి ♦ యద్భుతంబు త్రాగిందిరా
పరాక్రమహీనుకైన గాని ♦ పౌరుషంబు గొల్పురా
శరీర రోగమెల్లఁ దోఁచి ♦ సౌఖ్యమిచ్చి ప్రోచురా
ధరన్నవంగ దీనిలో న ♦ ధర్మమేది యానురా.

దుశ్శీ—(మఱియొకసారి పుచ్చుకొని కేకతో) వహ్వా! రేమియా? యారుచి! ఏమి యాకైపు! ఏమి యీనిశతమాషా! ఏమి యీ వింత!

(ఇద్దరును యొడ్డితెడ్డముగా నాట్యముఁజేయుచు)

శ్యామారాగం, ఆదితాళం.

దుర్బు— ఏమని సెప్పూదు ♦ యేమని సెప్పూదు
ఏమని సెప్పూదు ♦ యీ బ్రాంది మహిమ నిక
కామంధకారులకు ♦ చేర్చిమనోనగూర్చునార॥ ఏమని॥

దుశ్శా— ఇల్లాలైనగాని మతి ♦ యిల్లాలిసైనఁ గాని
మళ్ళైనగాని క్రియ ♦ మందఁజేసి త్రాగవలె॥ ఏమని॥

దుర్బు— కుత్తుకల్వీడిన ♦ నెత్తూరుల్ కారిన
చిత్తా మొకించుక ♦ జెదరనీయనిబంటు॥ ఏమని॥

దుశ్శా— క్షీరముల్ కానిమ్మ ♦ చెరుకుసారమే కానిమ్మ
పేరైన యీచిగురు ♦ సారాయికిసరియౌనె॥ ఏమని॥

దుర్బు— ఉద్యోగాలుండిన ♦ యూళ్ళేలుచుండిన
సద్విద్యలెన్నున్న ♦ వెలయునె? యిది లేకున్న॥ ఏమని॥

దుశ్శా— కవికైనగాని ♦ యా రవికైనగాని రమా
ధవునికైనగాని ♦ తరమా నెవణింప. ఏమని॥

[అని యొకరిపైనొకరు పడుచున్నారు.]

దుర్బు— (స్మారకముఁదెలిసి కోపముతో)

ఉత్సాహసుగంధి.

త్రాగుపోతత్రాగుపోత ♦ తప్పదాగుటన్ కడున్
జోగులాడ గచ్చులాడ ♦ జుట్టుపీడగా పడిన్
సేగిసేయ నెంచి నావో ♦ ఛీయికన్ని నన్విడన్
వీఁగడంతు బోరపోర ♦ (అనితన్నుచు) ఒక్కులెల్లవీడుమీ. 4

దుశ్శా—(లేచి కోపముతో) త్రాగుబోతు గాడిదకొడకా! నేనేనా గాజులువైచుకొన్నవాఁడను (అని పయిఁబడి పాదతాడనముఁ జేయుచు)

సమానిని. ఛీదురాత్మనీవధరన్, నాదు కత్తివేటునకీ
మీఁదఁ గత్తె వోదువో కో, వాదమేల వీడితికన్. 5

దుర్బు—(కన్నీరునింపుచు) అదిగో మనయన్నయగు దుశ్చేష్టుండిటు వచ్చుచున్నాఁడు. అతనితో మనపోట్లాటకు గారణముఁజెప్పుదము. మన నేరము బాగుగా విమర్శింపఁగలఁడు.

దుశ్శా—మంచిది.

దుశ్శే—(భంగుబుడ్డినిజేతఁబట్టుకొని పాడుచు ప్రవేశించుచున్నాఁడు.)

పికనాదము. భంగుద్రాగకయున్న ♦ వానికి జన్మమేలకో
యంగనామణిగూడి ♦ యాడనిప్రాయమేలకో
సంగడీండ్రనుతోడ ♦ సౌఖ్యవిహారమైయుకో
టింగురంగయటంచు ♦ తీవిగబోకనేలకో. 6

(దుశ్శీల దుర్బుద్ధులు వానిం గౌగలించుకొనుచున్నారు.)

దుర్బు—అన్నా! కూర్చుండుము.

దుశ్శీ—అన్నాయేది ఆభంగుబుడ్డి (అని చేతంబట్టికొని) వహ్వా! యేమి?

తరంగిణి. కలంజిభంగువిస్కి ♦ కల్లుబ్రాందు లాదిగా
గలట్టిమత్తునిచ్చు ♦ కార్యద్రవ్యసంతతి
న్విలాసిసీలచెల్మి ♦ వీటినిన్ సృజించెనీ
యిలారొవండొ వాని ♦ కేనుమ్రొక్కెదక్ష మదిన్. 7

(అని మఱలం ద్రాగుచున్నాఁడు.)

దుర్బు—అన్నా! రెండీ మాతము (అని కొంచెము పుచ్చుకొని) వహ్వా.

భంగే తాగవలె ♦ బాల నేపొందవలె
యింగితమెఱుగని ♦ యింతులచెల్మియేల. భంగే. 8

(అని పాడుచున్నాఁడు.)

దుశ్శే—మనగానపానవిద్యల సంగతి యందఱెఱింగినదియె. వాఁటికేమి గాని నేనొక్కచిన్నమాట వినియున్నాను.

దుశ్శీ—అదియేది. మనసంగతి కాదుగదా?

దుశ్శే—అది మనసంగతిగాకున్న నాకేల?

దుర్బు—జాగుసేయక వేగవచింపుము.

దుశ్శే—ఏమియున్నది. నేటితో మనపనిసరి.

దుశ్శీ—ఏమి? వలిపివలిపి జంపెదవు. త్వరగా వాకుృచ్చుము.

దుశ్శే—మీ కృత్యములు సరిగాలేవని యూరివారలు రాజుతో మొఱబెట్టుకొనఁగా మిమ్ము ను గారాగృహబద్ధునిగాఁ జేయనెంచెనే.

దుశ్శీ—నేను కొంచెము చూచాయగా పురజనుల ముఖవర్చస్సువలనఁ దెలిసుకొంటిని. గాని బాగుగాఁ దెలియకూరకుంటిని.

దుర్బు—ఏమీ ప్రభాకరుని మాధ్యము!

దుశ్శీ—ఔరా! ప్రభాకర! దుర్గుణగణాకర! (అనిలేచి)

చ. తెలియవో కండ్లుగానవో వి ♦ దేహుఁడనైతివటంచు నెంచితో
తలఁచవో నీకు నేను యమ ♦ ధర్మజుఁడంచును, నాదు సద్భుజా
బలము నెఱుంగవో తులువ ♦ బందిగ మండెనబెట్టనెంచనే
నలగిన మూఁడుమూళ్ళకాలు భ ♦ యంపడనీవన నాకులక్ష్యమే. 9

కాదిమ్మ. నీకుమృత్యువుసమీపించనది. లేకున్నయిట్టి దుర్బుద్ధిపుట్టదు.

(అని తిఱుగఁ గూర్చుండఁబోవుచున్నాఁడు.)

దుశ్చే—(లేచి) మిత్రమా! యాలసింపరాదు. “ఆలస్య మమృతం విషమ్మ”ని యెఱుంగవే? (అని మిత్రుని చేయిఁబట్టుకొని పైకి నెత్తుచు)

శ్యామారాగం, ఆదితాళం.

రారా పోదాము ♦ రత్నగిరిమేడాకు,
యీ రేయి యాతని ♦ బిరాన బరిమార్ప॥ రారా॥
ధీరాత యాతని ♦ దారాను వేఁబట్టి,
మాయాని కేళికి ♦ జేరాదీయవలె॥ రారా॥
చారులో యా జయ ♦ చంద్రి చంద్రిలాను,
క్రూరాతిజంపంగ ♦ ఘోరాటవీకంపు॥ రారా॥
తీరుగా నొకసారి ♦ త్రిమూర్తులడ్డైన,
వారింపఁగలండె ♦ వహ్వా మనకృత్యముల్॥ రారా॥

(అని యొకరిచేయి నొకరుపట్టుకొని గంతులువైచుచుఁ బోవుచున్నారు.)

[యవనిక జారును.]

---

## ద్వితీయరంగము.

[ప్రభాకరుఁడు భార్యతో మేడమీద నిదురించుచుండఁగా, దుశ్శీలుఁడు, దుర్బుద్ధి, దుశ్చేష్టుఁడు ప్రవేశించుచున్నారు.]

దుశ్శీ—మిత్రులారా! మీరీకవాటమువద్ద మీ మాయాయుధములతో సిద్ధముగా నుండుఁడు. నే లోపలం బ్రవేశించి యా జెనిఁబరలోక పట్టాభిషిక్తునిగాఁ జేసివచ్చెద. నాకెద్దియయిన హానిచేకూరుచున్నపుడు మిమ్ములను సంజ్ఞపూర్వకముగాఁ బిలచెద.

దుర్బు—మంచిది. ఇదిగో కైజారులను వరలనుండి తీసెదము (అని తీసిబట్టుకొని యున్నాఁడు.)

దుశ్చే—వేగమే యానృపుని భిలుకుమార్చి యాతనిరాణిం దోడ్తెమ్ము.

దుశ్శీ—అదియెంతపని.

(అని లోనఁ బ్రవేశించుచున్నాఁడు. మేడగదిలో నాక్రందనధ్వని)

(హా నాథా! హా ప్రాణేశ్వరా! అని యేడ్పువినఁబడుచున్నది)

దుష్టి-(నకిలతో) ప్రాణేశ్వరీ! యెక్కడిప్రాణేశ్వరుఁడు. అతఁడిప్పుడు ప్రాణవిసర్జ నుఁడయినాఁడు. ఇటురమ్మి. (అని ఆమెను గది నుండితీసికొనివచ్చి.)

సుగంధి. బాలనీదు వల్లభుంగ్ర ♦ ప్రాణపాలుచేసితిన్
జాలమేల వేళ మించెఁ ♦ జానరోతదీయభూ
పాలుమూరుగావెసంతు ♦ భంభోసంగ నీవున
న్నేలుకొమ్మి రమ్మికొమ్మి ♦ యిచ్చవచ్చినట్టుగా.

సుశీ—(గదిపైపు జూచి) హాప్రియా! (అని నేలపయిఁబడుచున్నది.)

దుష్టి—(ఆమెహస్తమునుఁబట్టుకొని సేవనెత్తి)

లయగ్రాహి. సుందరిమదీయహృద ♦ యేందిరత్వదీయముఖ
మిందునరవిందమును ♦ నిందయొనరించున్
డెందముమనోజకల ♦ నందమినినుంగలయు
గుందుదునుబాధలను ♦ బొందెదనుగాదే
యిందుముఖిమన్మథుని ♦ తొందరకుఁ జాళనిక
సందిటనుజేర్పవెయ ♦ మందగతి నేనీ
యందమునుజూచిభ్రమ ♦ జెందినినుఁబొందుటకు
నిందునరుదెంచితిని ♦ సందియమికేలన్. 3

సుశీ—(విచారముతో)

ఉ. ఏలరయిట్టితుచ్ఛగుణ ♦ మేలనుగ్గలైమదీయనాథునిం
దూలగ నేసినాఁడ వయొ ♦ దోషమొకించుక లేద యీండినం
జాలి యొకింతలేక యిటు ♦ జంపుటమేలె దయావిహీనదు
ర్శీలుఁడవంచుఁబిల్చుటకుఁ ♦ జేకురు సార్థకనామమిప్పుడున్.

దుష్టి—(కోపముతో) ఛీ.

దుర్మతి. ప్రలాపినీ యిటు ప్రేలా, విలాపము ల్విడకున్నా
యిలాపయింబడ నెట్టి, తలన్ కఠారిని ద్రుంతున్. 4

(అని ఖడ్గమును జూపుచున్నాఁడు)

సుశీ—(గడగడ వడంకుచున్నది.)

దుష్టి—(ఆమెచేయిఁగుఁ బట్టుకొని లాగుచు)

క. ఏలాజాలము చేసెద, డేలా యో బేలబాల ♦ యిటుపైనన్నిం
కేలీల నేలుకొనెదొ ను, శీలా! మది సిగ్గదేల ♦ చేకొనఁగదవే 5

సుశీ — (సిచారముతో) ఓరీ నిర్దయాత్మ! భర్తనుజంపినదే కాక నన్నిటులబాములు బెట్టుట నీకున్యాయమా?

దుశ్చే — పోయినభర్త తిరిగివచ్చునా?

దుశ్శీ — లయగ్రాహి.

చుక్కలను నేలుదొర ♦ దిక్కరను జేయగదె
చక్కని ముఖాబ్జమిక ♦ నెక్కుడనుజూడన్
ముక్కుతిలపుష్పమును ♦ జెక్కులును నద్దముల
నెక్కొనిసనంటులను ♦ మిక్కిలితొడల్ పెం
పెక్క నగచుండుగదె ♦ చక్కనికుచద్వయము
జక్కవల నెల్లనెక ♦ సక్కములఁజేయున్
టెక్కులను మానిదయ ♦ నెక్కుడుగఁజూపి చెలి
గ్రక్కున ననుబ్రోవగదె ♦ మక్కువలుదీరన్ ॥ 6

(అని పైటచెఱఁగును బిగియలాగుచున్నాఁడు.)

సుశీ — (స్వగతమున) హాదైవమా! భర్త వియోగమునకై యార్తి జెందుచుండఁగా నీదురాత్ముఁడు చేతోజాతశస్త్రజాల దహ్యమాన మానసుండై కారులనుచున్న వాఁడు. ఈతుచ్ఛునితో మాటలాడరాదు. కానిసమయము దప్పివచ్చినది గనుక మానము గాపాడుకొనుటకై యొకమాట చెప్పెదను.

సీ. సీతామహాదేవిఁ ♦ జెరబట్టివట్టియూ, దశకంధరుండును ♦ దగ్గఁడయ్యె
పాంచాలిఁగోరియూ ♦ పాపాత్ముఁడైనట్టి, కీచకుడలనాఁడు ♦ గడసిపోయె
గౌతముదారను ♦ గౌతుకంబునఁగూడి శాపమొందఁడె పాక ♦ శాసనుండు
అనసూయపతిపత్ని ♦ నవమానమునుఁజేయ బద్ధ్రమధవాదులు ♦ బాలురైరి

తే. గీ. అట్టివారలకన్నను ♦ దిట్టవౌదె? వాని వరుసలు దిగనాడి ♦ వలఁపురెంచి
వల్లభునిజంపి నాతోను ♦ వాదమాడఁదలఁచి తిఁకజాలునీమేలు ♦ తలపనేల.

దుర్బు — ఓహో! కొంచమంగీకారసూచనభావము గాన్పించుచున్నయది. బాగుబాగు.

దుశ్శీ — ఓసీ! వారలసంగతియటుండనిమ్ము.

సీ. నందిసీయనిమది ♦ సందియంబును లేక, పొందిన విధికియే ♦ నిందవచ్చె
గురుదారగోరుచు ♦ బరిమదోన్మాదమునక, మరిగిన నెలరేమి ♦ పరువుతగ్గె

మేనత్తతోఁ బోల్తు ♦ మానహీనమనియు, పెనఁగిన హరికిఁ జే ♦ ఘనతరతఁ గె
మఱిదండ్రికూటమి ♦ విరసంబని రొయింగి, పైగొన్న వ్యాసుకే ♦ వాసితగ్గ
తే. గీ. నెంచనట్టి మహాత్ములే ♦ మంచిచెడ్డ లెంచిరే యించుకైననుఁ ♦ యంచయాన
మించిమారుఁడు నన్ను ♦ వంచించఁ దొడఁగె గాంచినదియాదిగా నిను ♦ జెంచలాక్షి.

కావున నన్ను మారునిబారికిఁ ద్రోయక కూరిరతనుమాని నీసందిటనుఁ జేర్చి కందర్పశరబాధలం దొలఁగింపుము.

సఖి-అయ్యో! నేనునీకు వదినను గాదా! వదినలు తల్లులతో సమానముగదా.

దుశ్శా—జగన్మో. చాలుచాలు నిట్టి ♦ జాలమేలనే సఖీ జాలమేలనే
బాలచేలపట్టి ♦ వాదమెందుకే చేలీ వాదమెందుకే
మీలు కెక్కగాదు ♦ మించి వేచఁగా ప్రియా మించి వేచగా
గాలయాపనంబు ♦ గాగ నెంచెదో ఖలా గాగ నెంచెదో.

దుశ్శా—(సఖీలతో) ఆహా! బాగుగావచించినావు.

చ. వదినలు తల్లులం చిటుల ♦ వాదము సల్పుచు నుండ నేలనో
ముదితరో! పూర్వమందమర ♦ పూజ్యుఁడు గీష్పతి వాలిరమ్మెడున్
గదియరె? వారికింగలదె ♦ గామినితప్పులు గాన నీవృథం
బిదియొక సందియంబువడ ♦ నేటికి నేటికి గోరుకూటమిన్. 10

(అని చెఱఁగును బిరుగ బిగియలాగుచున్నాఁడు)

సఖి—చాలు చాలు. నీ పరిహాసపు పల్కులు వాడిశరమ్ములయి నాహృదయభేదనంబు గావించుచున్నవి. ఇఁక నాయొద్దనుండఁదగవు పొమ్ము.

[అని చెఱంగును విదల్చుకొనుచున్నయది.]

దుశ్శా—(చెఱఁగునువీడి కోపముతో) ఓచెలీ! మెల్లమెల్లఁగ జెప్పిన సల్లాపములుగా యోచించుచున్నావు కాఁబోలు ఇప్పట్టున నొప్పుకొనకఁ బోయినచో తప్పక బలాత్కారముగాఁ బట్టెదను. అట్లు కాకున్న నిన్ను తుత్తునియలుగా నఱకెదను. (అని కత్తి నెత్తుచున్నాఁడు)

సఖి—హా! రామచంద్రా! (అని నేలపయింబడి మూర్ఛవోవుచున్నయది)

దుర్యో—మిత్రమా! యీమె ప్రాణపదమగు ప్రాణేశు వియోగమునకుఁ గడుగుందుచున్నయది. ఒక్క నిమిషము తాళుదము. అదిగో జయచంద్రుఁడు చంద్రరేఖతో నిటకు వచ్చుచున్నవాఁడు. కావున మనమిట నిలువక నొక మరుగుప్రదేశము జొచ్చి యాతని సంగతి కూడా కొంచెము కనుఁగొందము.

దుష్టి—ఔను నీవుచెప్పినది బాగుగానున్నది. రండుపోదము (అని యొక మరుగుప్రదేశమునకుఁ బోవుచున్నారు)

[జయచంద్రుఁడు చంద్రరేఖతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

జయ—(తల్లినిజూచి విచారముతో)

ఉ. పైటచెఱంగునీడఁ గచ ♦ బంధముపూలిడఁగనూడ జెక్కులన్
గాటుకనీరుగూడ మొల ♦ కచ్చులువీడఁగనాడ మేనిపై
హాటకభూషలూడ కడు ♦ హానియొనర్పఁగ మేడమీఁదికే
జాటరివచ్చినావెచట ♦ జోచ్చెనొ జెప్పవె పిల్కుమార్చెదన్.

[అని తల్లిని లేవనెత్తి విచారముతో]

ఉ. అమ్మరో యిట్లుతల్లడిల ♦ నారడిబుట్టెరె యేరులేకనో
యమ్మరో యొద్ది చెడ్డకల ♦ నైననుగంటివె యట్లుగాక రా
జ్యమ్మునకైన శత్రులయ ♦ పాయముగల్గెనె చెప్పవమ్మ నే
నిమ్ముగ నీయభీష్టమును ♦ నిప్పుడె చేసెద నమ్మ యమ్మరో. 12

చంద్ర—క. జననిరో! నడిరేయి నిటుల
ఘనతర శోకాబ్ధి మునుఁగ ♦ గారణమేమే
జనకుం డలిగెనె నీపయి
వనజముఖీ! దెల్పవేల ♦ వనట గృశింపన్. 13

సుశీ—(విచారముతో) నే నేమనిచెప్పను కూనలారా!

సీ. ఆమ్నాయములుమహా ♦ యబ్ధినిదాటింప, నోడయై మనల గా ♦ పాడు నెవఁడు
సంతానమును ఘన ♦ కాంతారమున గ్రుమ్మ, సరణియై మనలను ♦ సాకు నెవఁడు
అన్వయంబను పెను ♦ యంధకారముఁబాప, యిందుఁడై మనల ర♦క్షించు నెవఁడు
అన్వవాయంబను ♦ యాతపంబున ద్రోయ, ఘనమై మనల కాపు ♦ గాచు నెవఁడు
తే. గీ. నన్నుమిమ్ముల బాలితో ♦ మన్ననలను, నంకపీఠిని నిడు నిష్క♦ళంకమూర్తి
యకట! యేమని చెప్పుదు ♦ నదిగో చూడు (అని శవమును జూపుచున్నది)
పాపి దుష్టిలుచేసిన ♦ పరిభవంబు. 14

[అని యేడ్చుచున్నది]

జయ—(శవముపైబడి) హాజనకా! నాయట్టి కొమరుఁడుండఁగా నీకిట్టియిక్కట్టె సంభవించినది? నేనేమిసేతును. ఎందుజొత్తును? మాకెవరు దిక్కు. (అని గుండెలు బాదుకొనుచు)

క్రౌంచపద వృత్తము.

హా జనకా నామీఁదలుకా నీ ♦ యనుఁగుసుతుఁడను ద ♦ య నెదను చేర్పవే
ధీజనస్తోత్రా వాగ్ఘనమిత్రా ♦ తిరమతినిగను మి ♦ ద ప్రియ సుపుత్రికన్
మాజననీ నిన్నుం బలుమారుం ♦ మమతను విడువక ♦ మరిమరి గోరుం
నైజశరీరా స్థైర్యవిహారా ♦ పరవరమొంటవినా ♦ నయముగ బ్రోవన్. 15

(అని విలపించుచున్నాఁడు.)

చంద్రి.—(విచారముతో) తే. గీ. జనకమమ్మింతదూరము ♦ గనినతోఁడ
గద్దెపైనుండి డిగ్గిన ♦ త్వమునవదిమి
చెక్కిలికిల్ చెక్కితోడలపై ♦ చేర్చువాఁడ
విపుడలుక జెందమా పాప ♦ మేమియకట.

(అని యేడ్చుచున్నది.)

సుశీ.—(విచారముతో) తే. గీ. యిలనెలజన్వనంబు న ♦ న్నలముకొన్న
దాదిగా నాదు బాలిమీ ♦ మీఁద జిక్కి
వ్రతములుపవాసముల్ సల్పి ♦ బ్రహ్మచేత
వరములొందితి మిమ్ముల ♦ వరుని గాత.

అదియునుంగాక.

సీ. నవ్వుటాలకునైన ♦ నొవ్వనాడెఱుఁగవు, కలనైన నాపయి ♦ నలుగవకట
నయినసంజ్ఞలకైన ♦ వదలింపనెఱుఁగవు, నామాట జవదాటి ♦ నడువ వయురొము
తప్పుకేసినగాని ♦ దండించిరొఱుఁగవు, కోపమించుకరైన ♦ జూపవహహ
కానిమాటలు నాడ ♦ కలహించుటెఱుఁగవు, యొవరి కేమిడినను ♦ జవురవభు
తే. గీ. పరిణీయాదికి ప్రియల్ ధర ♦ జరుగుటాదిరొక్కరనిమిషంబైనన ♦ న్నొంటిగాను
విడచిరొచ్చుట కైనను ♦ వెడలలేదు తగునె యిప్పుడు నాడి ♦ తరలిపోవ.

చంద్రి.—స్త్రీవృత్తము. దేవా! నీవే, రావా, కావన్. 19

జయ.—హా తండ్రీ! చిన్ననాటనుండి యరచేతి నిమ్మపండువలె బెంచియిప్పుడు నన్ను విడచి పోవుట నీకు న్యాయమా.

తే. గీ. దైవమామమ్ములనుమాడు ♦ తండ్రితోడ బంపుమీపట్టువరయోగ ♦ బాధలకును
తాళ జాలము భర్తవ ♦ త్సలుఁడవై తెనీదుదానుని కోర్కెలు ♦ బ్రోది సేయు.

సుశీ.—విచారవల్లరీ. నరనుతతిలకా ♦ నాపయిజాలికా
సరగున నన్ను నీ ♦ సందిలి నిడకా
ధరణిపధరపై ♦ ధర్మమె బడుటన్
నిరుపమగుణనా ♦ నేరము విడుమా. 21

జయ—హా! కన్నతండ్రీ! తే. గీ. నీకుద్రోహంబు జేసిన ♦ నీచునిప్పుడె
పట్టిల్లార్చినటులైన ♦ వసుధమీద
తండ్రిఋణమును తీర్చిన ♦ తనయుడంచు
శూరు లందఱు మెత్తురు ♦ ధీరమతిని. 22

కావున నాదుర్మార్గుండు నాకంటఁబడినచో నిప్పుడు మఱిపాలు గావింతు
కుందునా.

(దుశ్శీలుఁడు, దుర్బుద్ధి, దుశ్చేష్టుఁడు ప్రవేశించుచున్నారు)

దుశ్శీ—తులువా! యిప్పుడు కూసినకూఁతఁ దిరుగఁగూయుము.

జయ—(ఖడ్గమునుబూని కోపముతో)
పంచ. దురంబునన్ గరంబునీదు ♦ దోర్బలాన గెల్చిపో
దరంబుకాకయుండ నేడ ♦ ధర్మవృత్తి నిద్రలో
శిరంబుఁగోయ మానుషంబు ♦ చెల్లెనా దురాత్మునిన్
బిరాన జంపివేయకున్నఁ ♦ జేర్మిరేల కాల్పనే. 23

దుర్బు—(జయచంద్రుని ఖడ్గమును దీసుకొని దూరముగా గెంటివైచి)
తే. గీ. ఖడ్గమును బూని పైకరు ♦ గంగఁజూతుచాలుశూరత్వమింకనో♦బాల!నీకు
నాన్నపునకును దారత♦మ్యంబునెంచ నస్తిమశకాంతరంబన్న♦యటులఁగాదె?

దుశ్చే—పౌరుషంబునకేమి యడిగొని తేవలెనా! క్రియ జూపవలెను.

దుశ్శీ—(దుర్బుద్ధినిజూచి కోపముతో)
మత్త. చిన్నవారనియూరకుండిన ♦ జేటువచ్చును వీరిచే
మన్ననం బదియేలకో వన ♦ మధ్యమున్ దయమాలివే
తిన్నఁగా గొనిపోయి యచ్చటఁ ♦ దీసివేయ శిరంబులన్
క్రన్ననం గొనిపొమ్ము రమ్మికఁ ♦ గాలయాపనజేయకన్. 25

సుశీ—(పిల్లలను గౌఁగలించుకొని) ఆహా! రమణుని మరణమునకే శిరముదరిగి నటు
లుండ కడుపుచిచ్చునుగూడా కలిగించుచున్నాఁడు. ఇక నేటిబ్రతుకు? ఇదియే
కడసారి చూపు.

[అని వారలను ముద్దు బెట్టుకొనుచున్నది]

దుశ్శీ—త్వరితముగాఁ దీసికొనిపొమ్ము.

[అని కౌఁగిలి విడుపరకామెను, పిల్లలను బెత్తముచేఁ గొట్టుచున్నాఁడు]

దుర్బు—మంచిది. (అని పిల్లలను లాగుచున్నాఁడు)

చంద్ర—అమ్మా! అమ్మా! (యని యేడ్చుచున్నది)

సుశీ—ఛీ యింక నెట్లు జీవింపగలను! హా దైవమా! మమ్ముల నలుగురిని నీ చెంత నే జేర్పుము. (అని మేడకిటికీగుండ సముద్రములోఁ బడుచున్నది)

దుశ్శీ—ఆ! వీరిఢావృ. నను న్వేఁడను నను స్వీడను, జనక బాలా! ఘనంబౌ నే

(అని యామె చేతిని బట్టుకొన బోవుచున్నాఁడు)

చంద్రి—సోదరా! అమ్మ పారాసిలోఁ బడుచున్నది.

దుర్బు—మిత్రమా! వీరలను దలారి కొసంగెద.

(అని పిల్లలను దీసికొని పోవుచున్నాఁడు)

దుశ్శీ—(దుశ్శేష్టునితో) మిత్రమా! నాకీమె చిక్కినది కాదు గదా. తనసంతతిని బ్రతికించుకొనుటకైనను నాకోర్కె నెఱవేర్చినది కాదు, కానిమ్ము. రాజ్యపరిపాలన మనకు లభించినది. పోదమురమ్ము.

దుశ్శే—మంచిది. (అని నిష్క్రమించుచున్నారు)

తే. గీ. ధాత్రి సెలకంట్యాన్వయ ♦ ధార్మికులగు
లచ్చమాంబ లక్ష్మీపతు ♦ లకును గూర్మి
యుల్లుఁడైన సుందరరామ ♦ యాఖ్య చేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.



# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## తృతీయాంకము.

### ప్రదేశమరణ్యము.

(జయచంద్రుఁడు, చంద్రరేఖ, తలారి ప్రవేశించుచున్నారు.

జయ—(స్వగతము) తే. గీ. కట్టనొక్కదుర్మతిచేత ♦ కారణముగ
తండ్రిసమసెనుతల్లిసం ♦ ద్రంబుజొచ్చె
మాకుఁగూడను ఘడియలో ♦ మరణమిచట
ప్రాప్తమాచుండెఁగాపాడు ♦ భక్తవరద.

చంద్ర—అన్నా! నేనింకొక్క యడుగైనను నడువలేను పాదంబులునెత్తురు చిందుచున్నవి. (అనికూర్చున్నది.)

జయ—(విచారముతో)

ఉ. ఓయితలారిమమ్ములను ♦ నూరకద్రుంచఁగనీకునక్కటా!
చేయొటులాడునేమిపుడు ♦ చేసిన దేమి? వృథా శిరంబులన్
గోయుఁడటంచు నాజ్ఞనిడ ♦ క్రూరున కేవిధమైన హానియున్
జేయఁగలేదు జేసినను ♦ జెల్లునె కుఱ్ఱల మమ్ముజంపగన్.

చంద్ర—(తలారితో విచారముగ) ఓయీ! మాయట్టి చిన్నపిల్లలు నీకును నుండిరిగద. రాజుక్రూరుఁడై యాజ్ఞాపించినను మమ్ములనుచంపక యీయరణ్యంబునందు విడిచి పోరాదా? (అని బ్రతిమాలుచున్నది)

తలారి—(చంద్రరేఖను దూరముగా గెంటివైచి కోపముతో)

కవి. విడచుట నాకును సమ్మతిలేదొకఁ ♦ వేరిటునమిమ్ములఁద్రుంచెదఁగా
కడయఁగనేటికి భూవరునాజ్ఞలు ♦ దప్పు నధర్మముగాదభువిన్

గడగడ జంకిన మూనెడువాఁడను ♦ గాను నిదే వధియించెదఁబో
మదమహిలో నిశ్శిరంబులు వంచి సమానముగా నిలువుండుడీఁకన్

(అని కత్తి గిరగిరం దిప్పుచున్నాఁడు)

చంద్రి—(అన్నగారిం గౌఁగలించుకొని యేడ్చుచు) హా! సోదరా! తుదకు మనగతి యిట్లాయెను!

జయ—(స్వగతమున) హా దైవమా!

ఉ. ఇద్దర మాదునాళతికి ♦ నెంతటినూరులు ధీరులైన బల్
బద్ధులు గాగ నేడొక య ♦ భాగ్యునిబట్టి దురాత్మునాజ్ఞకున్
బద్ధులమైతి మేమవఁగ ♦ వచ్చును మేడలు మిద్దెలౌనుగా
మిద్దెలు మేడలౌనను ♦ మేదిని పెద్దల పల్కుబద్ధమే.

[చంద్రరేఖ గడ్డమును బట్టుకొని విచారముతో]

ఉ. చెల్లెల! నీవు నేఁడిటుల ♦ జింతిలనేటికి దైవయోగమున్
జెల్లకమాన దేరికిని ♦ జీబగు కాననమందు డాఁగినన్
దల్లడమొంద నేల మన ♦ తల్లియుదండ్రియును పీడిగుండిన జిం
తిల్లగ నేటికమ్మ విధి ♦ దీటుగ వ్రాసినవ్రాత తప్పునే!

అయినను మనలనుజూచి సంతసించువారలు లేరు. ఏల! నీవుడను పై గడునిడుమలు గుడుచుచు బ్రతుకుట?

ఉ. బాలరో! దుఃఖమేల పెర ♦ పంచలజేరి ప్రభాకరాజ్యమున్
శ్శీలుర సంతతంబు జన ♦ సేవయొనర్చుచు బొట్టకోసమై
గాలము పుచ్చుచున్నరితికి ♦ కష్టము లొందుటకంటె ప్రాణముల్
మేలగుఁ గాదపీడ ఘల ♦ మే మిలదీనుల మాచు నిల్వఁగన్.

తలారి—ఏలా?. యీజాగు. ఆలసించిన మాయేలికకుఁ గోపము రాఁగలదు. ఇంకనొక్క యరనిముసంబు నాగెద. (అని కత్తిని సవరించుచున్నాఁడు)

జయ—తే. గీ. దైవయోగంబు నేరికి ♦ దప్పవశమె
వంత పలదమ్మ చెల్లెలా! ♦ వసుధమీద
జావకుండురె జనులు వి ♦ చారమేల
వేడుమింకను ముక్తికై ♦ వేదవేద్యు.

తలా—ఇదిగో (అని కత్తి పైకిదీసి) యింకొక్కరనిముసంబులో వేదుదురు గాని.

జయ—(చంద్రరేఖ భుజములపైఁ జేయివైచి భూమిపై పుఁ జూచుచు)

దండకము. దేవాధిదేవా! కృపాపూర్ణభావా! పటుదుర్భారవారాశిని నమ్ము
దాటింపగా నాకు నీవేగదా యెంచు వామానసంబందు నిన్నెంచి యేనించుకన్
వేఁడుచుంటిన్ దయంజేసి నాపల్కులాలించి లాలించి పాలించుమోతండ్రి! మా
తండ్రి నిర్హేతుకంబౌఁగడుం గ్రూరుఁడౌ జారుఁడౌ చోరుఁడౌ పాపదుస్సీలుచే నేర
మెక్కింతయున్ లేకయే యర్ధరాత్రంబునం బ్రాణముల్వాసె నప్పుంతలోఁ బోక మా
తల్లిచేఁబట్టి తాఁ గట్టిగాలాగి పీనస్తనీ! యారతీదేవిచే చిల్కమైపన్నియున్ బైడి
తళ్కు న్నగంజాలుకల్కీ! తమిం దీర్పవే ముద్దుగుల్కంగ నాకమ్మవిల్కాని పూ
ముల్కికిందాళ నోర్వం! యీవేళ జాగేలనంచున్ బలింబట్టఁగా బిట్టువాపోవుచుం
జేలమైయేద్వ నాయేడ్పునాలించి కోపించి ఖడ్గంబుచేఁబూని దుర్మార్గుపైకేగఁగా
జూచి కోపంబునం జెంది మీసంబులందువ్వి హుమ్మంచు నంతందలారిన్వైపన్ బిల్చి
ఘోరాటవీమధ్యకున్వీరి గొనిపోయి యచ్చోట వాటంబుగాఁ గుత్తుకల్ గోసి యా
కాత్తురుం దెమ్మటంచానతీయం విచారించి యింకేటి కీపాటికిన్ బ్రాణముల్ బాయ
సేమంబహోయంచు మాయుంబకాయంబు పైరోసి వారాసిలోఁజొచ్చె రాజాజ్ఞ
నుంబట్టి యిచ్చోటికిన్వచ్చుటయ్యెంగదే దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ!
లసద్భూతిపతీ! మముంగావుమా దిక్కులేకున్న దైవంబెదిక్కంచు పల్మాఱుఁ
పెద్దల్ వచింపంగ నేవింటిగా నొంటిగా నుంటిమో జానకీలోల! శ్రీవేణుగోపాల!
శీలా! నమస్తే నమస్తే నమః.

తలారి—(కత్తి సవరించుచు)

ఉత్సాహ. చంపఁ దలఁచినాడ మిమ్ము ♦ జాలమేల వేళ లే
దింపుగాను పలుకుమంచు ♦ (అని వారితలలను క్రిందికివంచి)
డిప్పరన్ క్షణంబులో
జంపినైతు యమునిపురికి ♦ ప్రభువు మెచ్చునటుల జిం
తింపనేను నిపుచువాఁడ ♦ నే వధింపకుండఁగా.

[అని కత్తి గిరగిరం ద్రిప్పి క్రిందఁబడి కొట్టుకొనుచున్నాఁడు) అన్నన్నా! యాదురా
త్మునాజ్ఞవిని యజ్ఞానులగు కుఱ్ఱలం జంపనెంచిన నాయట్టి తుచ్ఛునకిట్టి కష్టము రా
వలసినదే. (అని విగతప్రాణుం డగుచున్నాఁడు)

[జయచంద్రుడు, చంద్రరేఖ, కనులువిప్పి విస్మయ మొందుచున్నారు]

జయ—అయ్యో! పాపమాతనికత్తి యాతనికేదగిలి మృతినొందినాఁడు.

చ. చెలియల! చంపివేయుటకుఁ ♦ జేసినయత్నము భంగమయ్యెనీ
తలవరిప్రాణముల్విడిచి ♦ ధాత్రిపయి న్బడెనిప్డుచూడుమా

దెలియఁగలేదు దైవికము ♦ దిప్పటికైక్య మె ధాతవ్రాతయున్
దలఁచినఁ దానునొక్కటిని ♦ దైవము వేఱొతలంచునొక్కటిన్.

అదియునుంగాక. గీ. దిక్కులేకున్న దైవమే ♦ దిక్కటంచు
సామెతను జెప్పురీతిని ♦ సరసవరులు
దలఁప నిప్పుడు సాక్షిగా ♦ దప్పకుండ
దోడ్పడియె నేఁడు మనలకుఁ ♦ దోయజాక్షి.

చంద్రి — అహా! యేమియదృష్టము. ఎంత కష్టదశలోనున్నను ప్రాణములు గోలుపోవుటకు మనసొప్పదుగదా. ప్రాణముతో సరియైన వస్తువు మఱియొకటిగానరాదు గదా. అన్నా! మనమిప్పుడు చావకుండ బ్రతుకుట ముందెన్నడియో గొప్పదశ ననుభవించెదమని తలంచెద.

జయ — అమ్మా! ఈకాంతారంబు సాంతంబుగా గడచినపిమ్మట నటుయోచించవలె.

చంద్రి — అన్నయ్యా! కాననమందు చిటపట ధ్వనులు గలిగి భూమ్యాకాశంబులు మంటలుగ్రమ్మి పొగఁజిమ్ముకొనుచు నెద్దియో మనదెసకు వచ్చుచున్నయది. (అనిభయముచే నన్నగారి ప్రక్కకుఁ జేరుచున్నది)

జయ — అమ్మా! భయపడకుము.

కం. అదియొక పన్నగ మెన్నగ
జెదరక యిచ్చోట నిల్వు ♦ పిడతునె పాపం
కదిమనమున వరుగఁగ నద
మదిమును జేతునిదె దాని ♦ మద మడఁగంగన్.

(అని కత్తిఁ దీయుచున్నాఁడు)

చంద్రి — సోదరా! నాకై ప్రమత్తుండవై సాహసింపకుము.

జయ — భయపడకుము. (అని దానిని వధియించుచున్నాఁడు)

చంద్రి — అహా! క్షత్రియవంశ సంభూతుండవైనందులకు పౌరుషము నిల్పితివి.

జయ — అమ్మా! ఇదియెంతపని.

చంద్రి — అన్నా! యీవనంబున ననేకగృహములేగాకుండ ననేక చిత్రములుగా గాన్పించుచున్నవి. అవియెవ్వియో దెల్పుము.

త్రిభంగివృత్తము.

జయ — చెలియాల! శుకములు ♦ కలగపముల పిక ♦ ముల మృదుభాషణవింటే
ముదమొంటే చెలిరొంగంటే

కలికిరో! కరిరిపు ♦ గజశరభ నఖులు ♦ కను భయమార్భటమొన్నన్

మదిగన్న క్ష్మాభీతియొదవిన్నన్

పొలఁతుక! కుటజ పున్నాగ తిలకములు విరు ♦ లల భువకాంతులు చెన్నన్

కవిఁగన్నన్ సంతసమెన్నన్

చెలువుక! లతల విరుల ఫలముల పొగడ్తల నతివేగ మెచ్చాలా

కనవేలా భూనుతిశీలా

(అని చూపుచు నేల పయిఁ గూర్చున్నాఁడు)

చంద్రి—అన్నా! ఏల బేలవయి నేల జతికిలం బడితివి? విశ్రాంతిం జెందితివి కాఁబోలు.

జయ—(పాదముఁ జేతితోఁ బట్టుకొని)

ఉ. కొమ్మరో! పాదమందు ముల్లు ♦ గుచ్చుకొనెంగద యోపనోపనో

యమ్మరో! సద్వ్రణాల్ నిక ♦ నావల నింపుక యైనఁగాని పా

దమ్మున లక్కువేయ్యెయున ♦ దారుణముగ్గ్రగవేసి నట్టుగాఁ

దిమ్మిర రెత్తుచున్మనసు ♦ దిమ్ముగ జేయుచు నున్నదక్కటా. 12

చంద్రి—(కూర్చునిపాదముఁ జేతితోఁ బట్టుకొని) అయ్యో! రక్తము వచ్చుచున్నది. (అని తన చేరుమాలును కొంటిగాచీల్చి పాదమునకుఁ గట్టుచు) హా దైవమా! దీనరక్షకా! యాపద్బాంధవా! దీనశరణ్యా! "తగిలినచోట నే తగులుట" యనురీతిగా, నిదివఱకే బాధలచే గుండుమండఁగ నిదియొక కష్టమునుఁ గూడఁ గలుగఁ జేసితివా?

(అని మూర్ఛవోవుచున్నది.)

జయ—(ఆమె పైఁ జెయివైచి దువ్వుచు శిరస్సుఁ దొడలపై నిడుకొని) అమ్మా! చంద్రరేఖ! చంద్రరేఖా! (అని పిల్చుచు విచారముతో)

ఉ. కాంతలు పర్విధానకరాఖ్యులకు ♦ రాజిలు పత్నిసుశీల రాణికిన్

బాలి ననుంగు కూతువయి ♦ బాలరో! నాకును ముద్దుచెల్లెలై

నేలను బండుకొంటిగద ♦ నీరజగర్భునివ్రాఁత తప్పునే?

కాలవశంబు దేరకిని ♦ గాకతొలంగునె బాలికామణీ! 13

అహా! "గోరుచుట్టుపయి రోకటిపోటు" అన్నటుల నిదివఱకుండు కష్టములకన్న నీబాధయొక్కువయ్యెనుగదా. దైవమా నేనెందుఁ జొత్తు (అనుచు నామెను ముద్దు పెట్టుకొనుచు విచారముతో)

సీ. అయ్యయో! నా పిన్నది! నలిగినట్టికీర్తి, నెన్ని పిల్చినఁ బల్కవేమి చెల్లె

ప్రాణంబునకు ప్రాణ ♦ పదమ పీవిట్లుండ, ప్రాణంబునకెన్నల! ♦ బాయదమ్మ

యొంటిగాఁ జరియింప ♦ జంటనై తిరిగినాను, కడగండ్లనీ కేలఁ ♦ గలిగెఁగాన
కఱకంపుదేవుని ♦ కన్నులకీవును, బలునైతివేమనం ♦ గలసుదల్లి
తే. గీ. బాలనీరూపు నీ సౌరు ♦ శీలతయును మరపునమ్మనె యెన్నిజ♦న్మములకైన
నీకునాకును నేటితో ♦ నిటులఋణము చెల్లఁజేసెనుఁ గాఁబోలుఁ ♦ జిన్నికుఱ్ఱ.

ఛీ. యింక నేటిబ్రతుకు!

చ. జనకుఁడున్ధరాత్రిమున ♦ జంపఁబడె న్విన లండ్రిపుత్రిచే
జనని విచారసాగరము ♦ నైవికసాగరమందుఁ జొచ్చె నీ
వనమున మూర్ఛనొందెగుణ ♦ వర్ధని చెల్లెలు భీతచిత్తయై
యనఘ! దయామయాత్మ! నను ♦ వంతము సేయవె నీకు మ్రొక్కెదన్.

అన్నన్నా! ఎంతపనిసంభవించినది.

సీ. అంతిపురంబుల ♦ నలరుచుండెడుబాల, ఘోరాటవులయందుఁ ♦ గుందవలసె
పాయసాన్నంబులు ♦ భక్షించుపసిబిడ్డ; యుపవాసములదూలి ♦ యుండవలసె
వీణావినోదిరై ♦ విలసిల్లు లతకూన, ఘనమృగార్భటవుల్ ♦ వినఁగవలసె
ధర్మడోలికలపైఁ ♦ బవ్వళించెడుబాల, బండఱానేలపై ♦ బండవలసె
తే. గీ. సకట! దుశ్శీలుచేనిట్టి ♦ యాపదవచ్చె ధాత నుదుటను వ్రాసిన ♦ వ్రాతయేమొ
వ్రాత గాదిది మాకర్మ ♦ ఘాతగాని కానియెడనిట్టికష్టముల్ ♦ గలుగుటున్నె.

ఆహా! యెంతపాపిలుమాలిన వాడనై దైవమును దూరుచుంటిని. కష్టదశలోనున్నప్పుడు నుంచిచెడ్డలు తెలియవుగదా! ఈమె మూర్ఛవోయినది నిజముగాఁ బ్రాణములు పోయిన పక్షమున ముఖవర్చస్సు తగ్గదా? ఉశ్వాసమాడుట మానదా? కావున వేగఁబోయి జలంబులు దెచ్చెద.

(అనియామెను ముద్దుబెట్టుకొని విచారముతో)

మందాక్రాంతవృత్తము.

తల్లిదండ్రుల్మరణమునసం ♦ తాపమున్నెప్పుడైనా
య్యున్నంజేవేళలతహాతవా ♦ ల్గొన్నందుచుండన్ కటాయీ
చెల్లెల్ పీడన్ హృదయమెటులం ♦ జెల్లు నిట్లొంటిగా నా
కాశ్చ్యంజేతుల్ గదలుటెటులీ ♦ కానపాల్ జేసిపోవన్. 17

ఔరా! నేనింక జాలముఁ జేసినయెడఁ దప్పక హాని రాఁగలదు. ఇచ్చట నెక్కడైన సరోవరంబుగలదేమో చూచెదను.

(అని వృక్షముపైనెక్కి నలుదెసలం జూచి) అదిగో! చూపుమేరమారమున

క. స్థిరమైమునులకు శ్రేయ,స్కరమైయన్నిఁటికి ♦ సౌఖ్యకరమైకమలా
కరమైయతిరమ్యశ్రీ, కరమైవిలసిల్లె నహహా ! ♦ కాసారంబుల్.

కావున నచ్చోటికింబోయి జలంబులందెచ్చెద. (అని క్రిందికిదిగి చెల్లెలిని ముద్దుపెట్టుకొని) అమ్మా! నినువిడచి యేగుటకుఁ బ్రాణమొప్పుటలేదు. ఏలయన

చ. జనని సుశీలగర్భమున ♦ జన్మమునొందిన దాది ధాత్రిపై
ననయము నొక్కకంచమున ♦ నా మెతగొంచును నిర్వురుంసదా
నెనరుగ నేకమంచమున ♦ నిద్దురఁజెందితి మమ్మ యిప్పుడీ
వనమున నిన్నుఁబాసి చన ♦ వ్రాసెనె ధాత దయావిహీనుఁడై. 19

ఆహా! నాకు మఱియొక యుపాయమేమియుఁ దోచకున్నయది.

చ. చెలియలనొంటిగా విడచి ♦ జీవనముల్ గడువేగఁదెచ్చి యీ
సిలుగును దీర్తు నన్న నిఁక ♦ జీవనమెట్టులు నిల్చుబాసినిం
జెలువరొ! యూరకుండు నెడ ♦ జీవముపోవు గదమ్మ నీకు ముం
గలి జన గొయ్యి వెన్కచన ♦ ఖాతముసామెత యయ్యెనియ్యెడల్.

కాని సర్వరక్షకుఁడైన దైవమున్నాఁడు అలస్యముఁజేసిన బ్రాణహాని రాగలదు. వేగబోయివచ్చెద. (అని యామె ముద్దుపెట్టుకొని లేచి నాలుగడుగులువేసి తిరుగ నామెచెంతకు వచ్చి కూర్చుండి ఆమె శిరముతొడపై నిడుకొని ముద్దుపెట్టుకొని)

ఉ. ఎంతలొ నెంతనిర్దయవ ♦ హించితి నమ్మరొ నిన్నుబాసి కా
కాసింతయుబాళిలేక విడి ♦ యేగగనెంచితి తల్లి దండ్రికై
వంతలు గుందుచుండమును ♦ వాటిలెనీకిపు డీవిపత్తు నా
మంతనమందు ప్రాణములు ♦ మానినిరో యిఁక నిల్పు టెట్లొకో.

అకటా! నా యార్తారవము వినువారెవ్వరు? యేల యీజాలము. కాలయాపనజేసిన తప్పక ముప్పురాగలదు. ఇచటనున్న కాంతారగణములకు వప్పగించిపోయి యొక్క నిముసములో జలములతో నిక్కడకేగెద.

[అని బిగ్గరగా]

సీ. హరులార కరులార ♦ తరులార విరులార, కావరె చెల్లెలఁ ♦ గరుణతోడ
మునులార వనులార ♦ గనులార కనులార, గావరే చెల్లెలఁ ♦ గరుణతోడ
నదులార పొదలార ♦ గుదులార మధులార, కావరే చెల్లెలఁ ♦ గరుణతోడ
అళులార పులులార ♦ వళులార శిలలార, కావరే చెల్లెలఁ ♦ గరుణతోడ

తే. గీ. నిచట విడనాడి నీటికై ♦ యేగుచుంటి,వచ్చువఱకును చిలియలి♦నిచ్చతోడ
గావఁగదవయ్య యాశ్రిత♦గహనులార,పోవ నెలవేని కొలనికిఁ ♦ బోదువేగ.

[అని చెల్లెలను ముద్దుపెట్టుకొని లేచి]

అమ్మా! కఠినహృదయుఁడనైనన్ను విడనాడిపోవుచుంటిని.

[అని యామె దెస తిలకించుచు వెనుకనడకగాఁ బోవుచున్నాఁడు.]

చంద్ర—(కొంతసేపటికి లేచి) అన్నా జయచంద్రా! జయచంద్రా! ఎచ్చటకుఁబోయి యుంటివి? సోదరా! నేనొక్కతె నిక్కాననంబున నుండఁగలనో లేనోయని న వ్వటాలకు నెచ్చటనైనను డాగియుంటివి గాఁబోలు. నేను నిన్ను విడిచి యొక్క ముహూర్తకాలమాత్రమైనను నిల్వఁజాలను. రమ్మా. రమ్మా. (అని కేకలు వేయుచున్నది. విచారముతో)

ఉ. అన్నయ యిట్లుసేయతగు ♦ నా ? పగ నేదిగ నాడనీకయో
నన్నిటఁబ్రోచు వారెవరు ♦ నాయెమె కానలపాలుసేత నీ
కన్నయనుంగులాప్తులిల ♦ గాంచగనున్న గదన్న లేచిరా
వన్న క్షమింపుమన్న శర ♦ ణన్నను సాక పదేమి సోదరా! 23

ఔరా! ఎంతపిల్చినను జాడలేదు. నామీఁదఁ గోపమువచ్చినది. ఏమి చేయుదును.

ఉ. అన్నయ! నిన్ను నెన్నడేదు ♦ రాడుటలేదు పరాకుసేయఁగా
జన్నె! కనన్నినున్ జనకు ♦ చాయనెమన్ననఁ జేయుచుండఁగా
నన్నిటఁజాతువంచుకల ♦ నైనను నెన్నఁడుఁ గాంచనైతినా
విన్నపమాలకించినను ♦ వేగమె ప్రోవఁ గదన్న వేడెదన్. 24

ఆహా! ఎన్నిసారులుపిలిచినను బలుకడు. ఏమిసేతును. (అనియేడ్చుచు)

మంజరి. పరిణతాఖ్యనుతా ♦ వరశీలన స
జ్జనభూషణ దు ♦ ర్జనదూషణ వే
వినుచెల్లెల నీ ♦ విపినంబున ద్రో
చను నీమదికిన్ ♦ జనుచేయనుజా. 25

ఇంకనైనవచ్చి నన్నాదరింపవా? నేనేమి పగఁజేసితిని. ఒకవేళ నజ్ఞానినై చేసినను మన్నించుట నీకు యుక్తమే కదా. నన్ను విడచుటకు నీకెట్లు మనసొప్పెనో తెలియదు. ఏలనన

సీ. మునుదుఃఖవారాశి ♦ మున్గువాడవొ కావొ, నాకు మైస్వస్థత ♦ లేకయున్న
నీవు నాతోపాటు ♦ నిరహారముండవో, కినుక నాహారంబు ♦ తినకయున్న
అమ్మతల్లీయంచు ♦ నలమటజెందవో, యేనొక్కగడియ ♦ కాన్పించకున్న
పల్లెత్తుమాటైన ♦ బల్కకుండుంగవో, పట్టినపట్టు నే ♦ వదలకున్న

తే. గీ. ఏల నాపయి నేఁడిట్లు ♦ జాలివిడచి, తరలుట గన ఋణానుబంధ ♦ ధర్మదీక్ష
ప్రాణపదమయినవస్తువుఁ ♦ బాసి వేగ, చనుదురనియెడు నారోక్తి ♦ సత్యముగద

అయ్యయ్యో! ఇంకనిన్నువిడి నేనీఘోరారణ్యంబున నెట్లుమనుదు. నాకెవరుదిక్కు, (విచారముతో)

వల్లరీ. అన్నయ నాపై ♦ మన్ననవీడక
గ్రన్ననకానల్ ♦ జన్నెటుచేయక. 27

(కొంచెము ధైర్యముఁదెచ్చుకొని) ఆహా! నే విచారించినలాభమేమి! అతని గుణ రూపలావణ్యముల నానవాలుదెల్పి యీవృక్షముసముదాయంబునడిగెదను. ఓపాద పములారా!

సీ. కలనైననసృతంబు ♦ బలుకనేరనివాఁడు, ధర్మమే జయమని ♦ తలఁచువాడు
ఆర్యులఁగనుఁగొన్న ♦ నతివినయుఁడగువాఁడు, పరులసొమ్మునకిచ్చఁ ♦ బడనివాఁడు
ప్రజలసుఖమ్ములఁ ♦ బడయఁగోరెడువాఁడు, ప్రాణిహింసకునుజొ ♦ ప్పడనివాఁడు
జనులునిందించినఁ ♦ గినుకఁజెందనివాఁడు, సజ్జనమైత్రియె ♦ సలుపువాఁడు
తే. గీ. సుగుణగణపతిఁ జూడఁగ ♦ సొగసుమూర్తి, పరవినుత కీర్తిసంతతా ♦ నందవర్తి
పాలితబుధాళిఁ సజ్జన ♦ చక్రవర్తిఁ, ఎచటకేగెనొ తెల్పరే ♦ యిపుడుమీరు. 28

అన్నా! మీయెడ నేనేమిపగఁజేసితిని. నాపయి యింత చలమూనుట. (అని లేచి ప్రతివృక్షము చెంతకుఁబోవుచు.)

సీ. సహకారకానవే ♦ సజ్జనసహకారు, సాలముకానవే ♦ పాలనేత్రు
చందనకానవే ♦ జయచంద్రచంద్రుని, మందారగానవే ♦ మందగామి
కేసరకానవే ♦ కేసరీపరిముఖు, వకుళమాకానవే ♦ వకులశ్రేష్ఠు
పున్నాగకానవే ♦ పున్నాగతిలకుని, యర్జునకానవే ♦ యర్జుననిభు.
తే. గీ. తాలతక్కోలతపనహిం ♦ తాలనీలి క్రముకకరవీరఖర్జూర ♦ కదళికాది
పాదపములార! నాప్రియ ♦ సోదరుండు బోవుమార్గంబుదెల్పరే ♦ సేవఁజేతు.

హారా! నేనెంతవేడినను బదులు మాటాడక తలలు విదురించుచున్నవి. అకటా వీనిని నిందింప బనియేమి?

తే. గీ. అధికబలుఁ గాలవశమున ♦ నల్పులనర వలసి కేమియు గర్వించి ♦ పలుకరకట
కాననాలు విరువుకై ♦ గహనమందు పుట్టుదురని యార్యులుబల్క ♦ వట్టిదగునె.

గావునవీని కేటికరుణ? ఎక్కడిపరశోక చింత? వీని నడఁగుటవాదియే కదా బుద్ధిలోపము. (అని నలుచెంతలబరికించి). అదిగో! కిరాతుఁడొకఁడు జిగురు, కండె

లు, వల, ఉచ్చులు, ఛింటెబద్ద మొదలగు వానితో వచ్చుచున్నవాఁడు. వానినడ గెదను (కిరాతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కీ ర్త న.

1. వనంబులందున - మనంబుచెడి - యిటు - వనర్

బొందనేలా? వృథావిచారించనేలా?

1. రమ్మానా - దుగ్గ్ర - హమ్ముననెనచి - బలు

సొమ్ములిడెదబాలా! లెమ్మిక - నిమ్ముగ జనబేలా!

3. అయ్యోనీమొర - కుయ్యాలించగనె - నెయ్యమొదవెతల్లీ!

ప్రియసూతుపుగుణముల పాల్వెల్లీ!

4. జాగేలను బోవలె - బాగుగనాతో

వేగముగారమ్మా - సొగసుల శృంగారపుబొమ్మా! 31

చంద్రి—ఓయీ బోయీ! యెచ్చటనైనను మాయన్నయగు జయచంద్రుని గాంచితివా?

బోయి—(తనలో) వహ్వా! యీచిన్నకన్నియ నాకు బాగుగాలభించినది.

తే. గీ. సంతుకోఱకు నరబలియొ♦సంగుసేని కలుగునదియంచు బెద్దలు♦పలుకుచుండ్రి
దీనిఁగొనిపోయి కాళికా♦దేవి కేను బలియొసంగెద సంతాన♦ పదవికోఱకు.

[ప్రకాశముగా]

పాదపవృత్తము. అన్న నెఱుంగను ♦ నమ్మ నెఱుంగన్
దిన్నగఁ సేఁజను ♦ తెన్నున రమ్మీ
పన్నుగ వేగులఁ ♦ బంపగ నేనీ
యన్నయు రాడెర ♦ యంబునఁ జూడన్. 33

(అని యా మెకరమునుబట్టి తీసుకొని పోవుచున్నాఁడు)

తే. గీ. అవనిగుణగణుఁడౌ బాప ♦ నార్యునకు
రమణమాంబకును గనిష్ఠ ♦ భ్రాతయైన
యలఘునుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## చతుర్థాంకము.

---

### ప్రవేశము—వింగుర్లాసముద్రము.

(జాలరివాండ్లోడమీదుఁగా బ్రవేశించుచున్నారు)

తెడ్డుపదము. మేలైనసిన్నాది హైలేసా మేలిమిబంగారు హైలేసా.
మొగముసందురినిబోరు హైలేసా నగవువెన్నెలగేరు హైలాసా
చనఁలుబంతులు సేలు హైలేసా కనులుకల్వలగేలు హైలేసా
నడలుకరులనుదూరు హైలేసా నుడులుయమృతమీరు హైలేసా
సింగారమేమందు హైలేసా చెంగావిసీరగట్టె హైలేసా
రంగుగకుస్సిళ్ళ హైలేసా ముంగలికి సీరాడె హైలేసా
సోయగమేమందు హైలేసా మాయూరకీల్బొమ్మ హైలేసా
కురులుచీకటిసేలు హైలేసా మరలుకున్నది నిన్ను హైలేసా

మొద—(తోడివారితో) ఓరోరి! యింకో రేతిరి లేదుగేందా. పక్కతూరైనా వలవేయలేదే?

రెండ—ఓరబ్బోసి! యింకా రెండు జేముఁలు రేతిరుండేరా. కళ్ళుకూరుకొని పోతున్నాయోసి.

మూఁడ—ఓరి నిద్రపోతా! కైడుఁగొండలాగు మేగాలు బట్టి దడబడలాడుసుండ రేతిరుండనుకొంటివేంటార్రి.

నాల్గ—ఓరీ! యిప్పుడేకాదంటోసి. జాముకోడి కుక్కురూయంటూ గూసింది.

అయి—జాము రేతిరి కన్నెక్కుడుండిసేని సావల సేపలన్నిచ్చేసద.

మొద—(రెండవవానితో)

సుగంధి. ఏరసీకు యింతనిద్ర ♦ యేవరైన నాగరే

రెండ— పోరపోర నిద్రయింటు ♦ పూటపూట యుండువో

వాల్గ— యోరిరేతిరి రెండుకేము ♦ లుండలేపుకేలరా

అయి— మీరుమీరు గుద్దులాడ ♦ మింసిపోనదేమిరా.

మాఁడ—(తోడివాండ్రితో) మొన్నకనారం యేటకెళ్ళామగందా. యెన్నిసేపల దొరకాయని సిప్పను. చోర, పాలచోర, కొమ్మచోర, సుమ్మడిచోర, సున్నచోర, రొన్నచోర, తిండిచోర, తిక్కచోర, పెదచోర, ముట్టచోర, పండుగొప్ప, మాలతప్ప, ముసచెప్ప, తిక్కమొప్ప, తినిమొప్ప, చాకలిమొప్ప. యీతతిప్ప, చెమ్మిపాము, పెదచెమ్మిపాము, పులిపాము, ములుగుపాము, ఓరబ్బోయింకాయెన్నో కెలగోకెలగ.

నాల్గ—ఓసియింతేనా? నాకుదొరికినవి లెక్కేలేదు జల్ల, బుర్రిజల్ల, నల్లజల్ల, యఱ్ఱిజల్ల, ముట్టిజల్ల, కోడిముక్కుజల్ల, బుర్రిముక్కుజల్ల, గడ్డిజల్ల, పంతకోడిజల్ల, గొగ్గపాటిజల్ల, బంగజల్ల, చీగిజల్ల, రాటిజల్ల, రేయి, గాజురేయి, పన్నరేయి, కండాపురేయి, యిలరేయి, దామరేయి, బు…గరేయి, సీలరేయి, ఏలెఱ్ఱి, నీలకంఠరేయి, తేటరేయి, కంకిరేయి, శింగిడిరేయిలున్నా, పీక, పులిపీక, యెలుగుడుపీక, మండపీక, పాలపీక, సవాయిపీక, రాతిపీక, యొఱ్ఱిపీక, తుండిపీక, గుడ్డిపీక, సాలిపీకలున్న టేకి, యాలంటేకి, పాలటేకి, నరాలటేకి, నల్లముట్టెటేకి, పులునుటేకి, కాకిటేకి, యింకా యెన్నో కుప్పతిప్పలుగా దొరికామోసి. ఆయేలమా మంచి చకునం.

అయి—ఓరి యీమాత్రిన కేంటారి చంతోచం.. మొన్నపోయి చోమారంపొద్దున్న యెన్నియెన్నిరా బాబు! సెప్ప అచ్చెరం ఆతాదిఫిను.

కొవిమ్మరాయి, దుడ్డుకొవిమ్మరాయి, నేతికొవిమ్మరాయి, పాలకురాయి, ముళ్ళాకురాయి, అంతికాయి, కండబాయి, కాళ్ళకంకడబాయి, యింగలాయి, గుడ్డింగిలాయి, బొంబిడాయి, మేదరాయి, మసురు, కదును, యిలస, పులస, మట్టగిడస, తోకపరిగ, ఏలికపరిగ, తెడ్లామ, యాలామ, మాగ, బుడంమాగ, సందువా, నల్లచందువా, కచ్చిల, కలిమి, గొరక, కొయింగ, గండుమేను, కొఱ్ఱిమేను, చీరమేను, కాటుమేను, పండుచేప, వెంకిచేప, యిసకదొంతి, బుగ్గదొంతి, వాలిగ, వాల, సావిడం, కుక్కనాల్క, మాత, కడిం, పార, రావ, చీంబోతు, తెల్లపొట్టయేట, పంజిరం, తూర, యివి రకానికి ఎయ్యితక్కువేవు గందా. చెప్ప నాకు నాకె యద్భుతంరా.

రెండ—ఓనాలి తప్పాగొయ్యా నీ డబక్కలకేమి. ఓడ చముద్రిం మయానకొచ్చింది. వల పరండోస్స.

అయి—పరండోసి. పరండోసి. (అని వల వేయుచున్నారు.)

(అందరు వలలాగుచు) ఏలా బేలా మలేసా
హైలేసా వాలా యేలేసా
హైసా హైసా హైలేసా
చేసూ భాను హైలేసా. 3

మూండ—మొటమేటకే వల యీలాసిక్కిందేరా!

నాల్గ—మనపోట్లాటకు దచ్చినఫలం కాబోలు.

మొద—దిగంటోసి.

రెండ—నీవే దిగరాడోసి.

మూడ—నీవోసి.

నాల్గ—నీవోసి.

అయి—పల్లికులాన్న బుట్టలేదంటార్రి, యింతభయ మేల.

(అని దిగి తడుముచు)

వసంతకోకిల. అరేయరేయరేయిదేటో ♦ యాచ్చరంబుగా
కరంబునందుజొచ్చెపద్ద ♦ గండుసేపగా
బిరానరండురోసినాకు ♦ భీతిబుట్టురో
బరాబరీగయెత్తిపార ♦ వైత మొద్దుపై. 4

మూడ—(దిగి తడుముచు)

షట్పదము. ఏరనీవుపల్కులూసు ♦ లెంతో యద్భుతంబురా
బారమంటు భయమటయంటు ♦ పద్దబొబ్బలెట్టితా
లేరయింత వగసపుట్ట ♦ లేదపల్లియానికి
ట్లోరిసిబ్బి తెవరువిన్న ♦ యొద్దుపైకినెత్తరా. 5
(అని యొద్దుపైనఁబడవైచి వలత్రిప్పి విప్పుచున్నారు)

మొద—ఓసీ ఘనుంసేపెమేరా!

రెండ—సాల్లే ఘనుంకాదోసి. ఘనుమైతె యెనుంలాగే వుటింది.

మూడ—తిమిరా.

నాల్గు—తిమికాదురా నీతమిసే ఆలాగనుకుంటున్నావు.

అయి—రావణహస్తమోసి.

మొద—రావణహస్తమా నీకు సేదస్తమా?

(అని వలవిప్పుచున్నారు.)

రెండ—సుగంధి. ఏవుమీర యెంతభార ♦ మెంతకాంతియుండెరా

మూడ— సేపగాదు పీపగాదు ♦ నేడియేమొ చూడరా

నాల్గ— పీపగాదు జెల్లగాదు ♦ పీనుగేమొ చూడరా

మూడ— యూపిరాడునుండెనూడు ♦ యువ్విదంపశత్తురా. 6

[అని వలతాళ్ళు విప్పఁగనే సుశీలలేచి కూర్చుండి]

హా ప్రభాకర మహారాజరాజా! హా జయచంద్రా! హా చంద్రరేఖా! అను చున్నది.)

అయి—అరే! దయ్యమూసి (అని పారిపోవుచున్నాఁడు)

తక్కినవారలు—అరేపిశాసమోసి. కామరా కాటిణుయేమో!

కాదసిపద్దశక్తి. కావాసి మన్నిమింగడానికి వచ్చిన రాతుసిరా.

(అని యొకరినొకరు గెంటుకొనుచు పారిపోవుచు న్నారు.)

సుశీ—[illegible]! యిదియేదేశము. వీరలెవరు? (విచారముతో)

కవిరాజరంజనీ. ప్రభాకరా! ప్రభాకరా ప్రభాకరాన్వయా

సుభూషణా, సుభాషణా ♦ సుభూషితప్రభో

విభావభాప్రభానుభా ♦ న్వితానభాకభా

విభూతిభూతిభూధరా ♦ విభావరీనిభా. 7

ఆహా! అమ్మహానుభావుని వర్ణింప సహస్రవక్త్రునికైనా యలవి కాదు. నాకు శక్యమా?

తే. గీ. వసుధనభములు నేలుప్ర ♦ భాకరుండు

వరగుణ దయాపరుండు ప్ర ♦ భాకరుండు

పాపవనదహనుండు ప్ర ♦ భాకరుండు

అట్టి మహనీయువిడనాడి ♦ యెట్టులుందు. 8

అయ్యయో! పతివియోగమేగాక కడుపుచిచ్చున కేమందును.

ఉ. సంతతిగల్గగాకులము ♦ సంపదరాజ్యము వెంపునంచునే

సంతసమొందితిన్ విధివ ♦ శంబిటులుండ మదీయకోరుకుల్

సాంతముగాఫలించునెయ ♦ సత్యయభాగ్యపు హీనురాలనా

కంతటిభాగ్యమబ్బునెద ♦ యాపరసాధ్వికిఁ గాక భూస్థలిన్. 9

ఓకూనలారా!

తే. గీ. నాదుపాత్రివ్ర్యయందున ♦ బోధిడిఁజేసి

తుదకు కానన మందున ♦ దుఃఖించ మిమ్ము

బట్టికొనిపోవ గనుచున్న ♦ పాపినేను
తల్లినేమీకు మృత్యువ ♦ యిల్లుగాక. 10

కటకటా! యేమందు.

చ. ఖరఖరదీప్తి తేజుఁడగు ♦ కాంతునిచావున కైనగుందనా
వరగుణ శ్రేష్ఠులయినపసి ♦ పాపలమిత్తికి దుఃఖమొందనా
చెరచెరులైన జాలరుల ♦ చేతికిజిక్కితి నేడు పొక్కనా
హరహర! యేమి నాబ్రతుకు ♦ నాదరమయ్యె! విచారమయ్యెడున్. 11

అకటా! నాయార్తారవము వినువారెవ్వరు. ఓ మహారాజా! నీయనుంగు పుత్ర పుత్రికలతో స్వర్గంబున సుఖంబుగా కాలము పుచ్చుంటివా. నేను పాపాత్మురాలనా! మీచెంత చేరుట కావంతైనను నోచుకొని యుండలేదా? (అని పలుదెసలఁజూచి) ఓ జాలరులారా! నన్నేల బయిటకు దీసితిరి. తిరుగ నన్నెప్పటిచోటుననుంచి వేయుఁడు.

[జాలరివాండ్లు ప్రవేశించుచున్నారు]

మొద—(తోడివారితో) అరే దయ్యముగాదోసి పిశాచముగాదోసి మంచి అచ్చరవైన స్త్రీరా.

[అందరునామెచుట్టు తిరుగుచు చప్పట్లువేయుచు]

హా య ప్రి చా ర ర గ డ.

రెండ— మందయాన ♦ యందమోసి
మూడ— యిందిరైన ♦ యందదేసి
నాల్గ— మొగముకల్వ ♦ బోలునోసి
అయి— మగువమంచి ♦ మానసోసి
మొద— గళముదన్ను ♦ కంబునోసి
రెండ— బాలరూపు ♦ పచిడిరోసి
మూడ— దీనిజాడ ♦ గానెనోసి
నాల్గ— కనులుపండు ♦ గాయెనోసి
అయి— దీనిబెండి ♦ నేనుయాడ్త

[ఒకరినొకరు గెంటుకొనుచు]

మొద— నేనెయాడ్త ♦ నేనెయాడ్త
రెండ— నేనెయాడ్త ♦ నేనెయాడ్త
మూడ— నేనెయాడ్త ♦ నేనెయాడ్త

సొల్ల— నేనెయాడ్త ♦ నేనెయాడ్త
అయి— నేనెయాడ్త ♦ నేనెయాడ్త
మొద— నేనెయాడ్త ♦ నేనెయాడ్త 12

[అని అందరి తరిమివేయుచున్నాఁడు]

తక్కినవారు—నీవుశ్లోకిరారోసి. నీషనిచెపుతాం.

[అని నిష్క్రమించు చున్నారు.]

మొద—(సుశీలతో)
విచిత్రవృత్తము. నినుంబెండిలాడన్ ♦ మనంబందుబుట్టెన్
ఘనంబొప్పనన్ని ♦ చ్చనంబేలుకొమ్మి, 13

సుశీ—(స్వగతము) దైవమా! దుష్టులుని బాధకోర్వలేక సందర్భింబునం జొచ్చినను నీ కూరులచేతిలోఁ జిక్కఁజేసితివా. ఇప్పుడీ దుర్మార్గుఁడేమిచేయునోగదా! చా వఁదలఁచితి. ఇంక నాకు భయమేమి? (ప్రకాశముగా) ఓరీ నన్నేలపయికి దీసితి వి? ఎప్పటట్టుల జలరాసిలోఁ బారవేయుము. మాయట్టి రాజపత్నీపతివ్రతాశిభా షణుల నిట్టిదుర్భాషలాడవచ్చునా? పాపముచుట్టుకొనదా?

మొద—సేనసేన. రాజాపతులైతేమాకేం! మేసాపతులైతేమాకేం! నేనుతప్పక పెం డ్లాడెదల్నాను.

సుశీ—ఛీఛీ నోరుమూయుము. ఇట్టికాఱులఅపకుము.

మొద—అ ఆ అ. ఆలాగా (అని ఆమెచెయి బట్టుకొని లేపలెత్తి)
స్రగ్విణి. ఇట్టియూనూలకేం ♦ యెన్నెనోనూసితిక
జాట్టుపట్టావారు ♦ జూచియేంసేతురో
గట్టిగాకొట్టులో ♦ గట్టిపారేసినం
జెట్టుపట్టీనమం ♦ సెప్పినట్టిందువో.

(అని యామెను గొట్టులోఁ బడవైచి తాళము వైచి తలుపుపైఁదట్టుచు)

అ—విభూతి. నోరికొస్సినట్టులం ♦ సీరిమాటలాడకక
నోరుమూచుకూరకో ♦ నారికేసివేతుగా. 15

(అని నిష్క్రమించుచున్నాఁడు)

(ఒకపక్కనుండి పల్లివానిభార్య గంపచేతబట్టుకొని ప్రవేశించుచున్నది.)

(రెండవపక్కనుండి మరియొక పల్లివానిభార్య ప్రవేశించుచున్నది.)

మొద-భా—వొదినా యెక్కడనుంచొస్తున్నా.

రెండ-భా—మాయన్నకేదో అచ్చ రప్పైన తిరి దొరికిందని మీాయన్న చెప్పితే చూడా నికి కొచ్చానో.

మొద-భా—యీాగోట్టులోపడేసి తాళంవేచాడు.

రెం - భా—యేదీతీయి యెంత చుందరంగావుందో చూతాం.

మొద - భా—( గంపవచ్చుటదించి తాళముఁ దీయుచున్నది.)

(సుశీల నివతలకు వచ్చుచున్నది. వారలు విభ్వారపాటుతో చూచుచున్నారు)

మొద-భా—ఇచ్చటుండక మరియేచోటికైనాపో. నామగడు మంచాడుకాడు. ఆ డికినాకు పోట్లాటతెచ్చి నాకాపరం గంగలో దించినదాన వవుతావు.

(అని గంపతో సుశీలను గెంటుకొనిపోవుచున్నది.)

(రెండవపల్లెవానిభార్య దానివెన్క నిష్క్రమించుచున్నది.)

తే. గీ. ధాత్రి నేలకంటోర్యము సుం ♦ దరశివాఖ్య
భావనారాయణులప్రియ ♦ మఱఁదిరైన
యలఘు సుఖధి సుందరరామ ♦ యాఖ్య చేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత. 16





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## పంచమాంకము.

ప్రదేశము - అరణ్యము, కాళికాలయము.

[చంద్రరేఖయును, బోయివాఁడును, ప్రవేశించుచున్నారు.]

చంద్ర—ఓయీ ! నన్నీకాళికాలయమున కేలదెచ్చితివి ?

బోయి—తే. గీ. సంతుకోఱకు వరబలి ♦ యొసంగినేని
గలుగునదియంచు పెద్దలు ♦ పలుకుచుంద్రు
గాన నిన్నిప్పు డీకాళి ♦ కకును భక్తి
బలియొసంగెద సంతాన ♦ పదవికోఱకు. 1

చంద్ర—(గడగడఁవడఁకుచు విచారముతో మనసులో) మహారాజరాజమహీమండలుండును, బుధనుతకీర్తిమంతుఁడును, నగు ప్రభాకరు నకును, మహాపతివ్రతశిఖామణియని పేరొందిన సుశీలకును, ముద్దుకూఁతునై మహాపరాక్రమశాలియగు జయచంద్రునకనుంగుచెల్లెలనై నేడుదిక్కు లేక యిక్కానవంబున నొక్కఁ ముక్కడివానిచేఁ జావు సిద్ధించుచున్నదిగదా. హా దైవమా! యిమ్మనఁ బనియేమి ? మాయన్నగారు చెప్పినచొప్పున విధాతవ్రాఁత దాటఁదరము గాదు గదా ? అయినను నొక్క మాట చెప్పెద. (అనిప్రకాశముగా)

తే. గీ. నీదు మేలుకోఱకు ♦ నితరుల బలినిడ
కాళియేలకోర్కె ♦ బొనిడును
యక్కఱకొలదిటుల ♦ మ్రొక్కు దీర్చుటె గాని
ఫలమదెల్ల కలుగు ♦ పతికి నీకు, 2

అదియునుంగాక.

ఉ. వారకబోయివాఁడవని ♦ వచ్చితినమ్మిట నీదువెంటన
న్నూరకఁజంప నెంచితివి ♦ యొప్పునె? నీమదికింత సాహసం
బారసిఁజూడఁగా నజము ♦ మర్త్యుని బాయక తోడునీడగా
కూరిమితోడ దిర్గనది ♦ క్రూరమతో బలి యిచ్చుటేకదా. 3

ఏల? నాయందు దయమాలి మడియింప నెంచెదవు. నామాట లాలించి నీయింటఁ బెంపుము. ముందుసంతతి యొనఁగూడుట వట్టిదిగాని యొనగూడుట ముఖ్యము.

బోయి— తే. గీ. పూర్వకాలము నన్మునఁ ♦ బూర్వులబల
వరములనుఁ బొందఁగానెంచి ♦ పరమతుష్టి
మహిషములు కుక్కుటమ్ములు ♦ మనుజులాది
బలియొసంగిరటంచును ♦ బల్కిరి నమె. 4

పాపమున్నచోనటులఁ జేయుదురా. వీనియన్నిటికన్నను నరబలి ముఖ్యము. దాని నొసంగఁగా నేతత్క్షణమే దేవి ప్రత్యక్షమై కోరిన కోర్కెలు కొఱఁతలేకుండ నిడును. కావున నాలస్యముఁ జేయరాదు. శిరస్సువంచి నమస్కరింపుము.

చంద్ర---(విచారముతో)

రుగ్మతీ. ఆరఘుభూషా ♦ యాశ్రితపోషా
నేరములేకన్ ♦ నేఁడిటఁజంపన్
గోరుచుండెన్ ♦ క్రూరుఁడువన్నన్
భాగమునీదే ♦ బాగుగఁబ్రోవన్. 5

(కోపముతో) నీవసలే కిరాతవంశజుఁడవు అందులో గొడ్డువాఁడవు. నీకు మంచిచెడ్డలు దెలియు టెట్లు? నే నిదివరలో నెవరికిని మ్రొక్కియుండలేదు. మ్రొక్కెడు పద్ధతిం గనపర్చుము.

బోయి—పాపము మ్రొక్కించెదఁ జూడుము (అని కత్తి గిరగిరం ద్రిప్పుచున్నాఁడు.)

చంద్ర—(గడగడవడంకుచు కన్నీరునింపుచున్నది)

(తెరలో) ఓరీ ! నా పేరు సుశీలుండని యెఱుంగవా?

[అని సుశీలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఉత్సాహ. ఘోరకాననంబునందు ♦ క్రూరమతిని బాలిక
న్నేరమేమి లేక యెటుల ♦ నేఁడు చంపనెంచితో
చీరివైతు వోడలు రెండు ♦ చెక్కలుగను నిప్పుడే
పోర (అని గుండెలపైఁ జేయవేసి గెంటి)
దిక్కుకర్గియున్నఁ ♦ బోయిచెప్పుకోవలెన్, 6

బో-(కోపముతో) ఉత్సా. ఇటుల దంభములనుబల్కు ♦ నిప్పుడే నిను స్వైరక
చిటికెలోన ద్రుంచివైచి ♦ చిన్నికన్నెఁబిమ్మటన్
తటకున న్నిరంబుఁ గోసి ♦ ధన్యకాళికీయ నీ
వెటులఁ బోదువెందుఁజొత్తు ♦ వేమిసేతు చూతురా.

[అని సుశీలునిమీఁదికరగుచు]

బోయి—పంచ. కరఁబుడంబుమీఁఅనేఁడు ♦ కత్తిమీద కత్తితో
సుశీ— శిరంబుఁగోయకున్న నిప్డు ♦ భీయటంచుఁ బిల్వరా
బోయి— పరాక్రమహీనపల్కులేలఁ ♦ జట్టపట్టు వేగమే

[అని యిర్వురుఁ గలియబడుచున్నారు]

(సుశీలుఁడు బోయిని పడవైచి మీఁద కూర్చుని కత్తిపైకెత్తి)

దురాత్మ చావుచావు ♦ దుడుకులన్నిపీడుచుక. 8

[అని పొడుచుచున్నాఁడు]

చంద్ర—ఆర్యా! నాపుణ్యవశంబున మీరడ్డుపడుటచే నాకు మారుగా నీకిరాతుఁడుప రలోకగతుఁడయినాఁడు.

సుశీ—(పైకిలేచి బట్టసవరించుకొనుచు) అమ్మా! నీకిఁక భయములేదు. (అని నిలువఁ బడి) నీవు రాజ కుమారికవలెఁ గాన్పించుటయే కాక నాకుఁ బ్రియబంధువర్గము లోని దానివలెఁ గన్పట్టుచున్నావు.

ఉ. ఎక్కడకన్నెవీవుకుల ♦ మెయ్యది నీతలిదండ్రు లెవ్వరో
యక్కటరయొంటిగా గహన ♦ మందుఁజరించుట కేమిబోయవాఁ
డెక్కడ నీకుఁదారసిలె ♦ నిచ్చటఁ జంపఁ దలంచు టాదిగా
నిక్కమెఱుంగఁదెల్పు మిఁక ♦ నీరజనేత్ర శుభంబు చేకురున్. 9

చంద్ర— ఆర్యా! నా పేరు చంద్రరేఖయందురు.

సుశీ—(మదిలో) ఆహా! రూపునకుఁ దగిన పేరే.

చంద్ర—నా తండ్రిరత్నగిరి దేశాధీశుండైన బ్రిభాకరుండు.

సుశీ—నీజనకుఁడు ప్రిభాకరుఁడేనా? అటులయిన తర్వాత, తరువాత.

చంద్ర—నాజనని సుశీల నా (—)

సుశీ—(ఆమెను కౌగలించుకొని) నా తోబుట్టుకూతువే! నా ముద్దుల మేనగోడలవు(అని యామెను ముద్దుబెట్టుకొని) ఏదితరువాత తరువాత.

చంద్ర—అన్నయ జయచంద్రుఁడు (అనియేడ్చుచున్నది)

సుశీ—ఉ. అమ్మ! విచారమేలవిను ♦ హాయిగనీస్వజనంబుచెంతశ్రీ
ఘుర్మిమ్ముగనిండఁజేయుటకు ♦ కన్నియ నాదిక భారమమ్మమీ
యమ్మరొ మత్సహోదరియు ♦ నౌనఁ ప్రభాకర రాజు భావ యే
నమ్మతదీయభ్రాతయగు ♦ నా జయచంద్రుఁడుభాగి సేయుఁడీ
వమ్మరొ భాగి సేయి వీఁక ♦ నంజిక లేటికిదుఃఖమేలిక న్. 10

చంద్ర—(స్వగతమున) ఇంచుక హెచ్చుతగ్గగా మాయమ్మను బోలి యున్నవాఁడు. ఒకవేళ బోయినలె మోసము జేయఁ దలఁచినవాఁడేమో. (ప్రకాశముగా) నీవు మా మేనమామ వయినపక్షమున మాజననికిఁగల రూపలావణ్యాదుల దెల్పుము.

సుశీ—సరే మంచిది.

సీ. భూరిమస్యమందున ♦ బొట్టురీతిగనుండు, పుట్టుమచ్చయు లేదు ♦ పుణ్యసతికి
నగినచోఁ జెక్కిళ్లు ♦ సొగసుగా గుంటలై, నిగనిగలాడవే ♦ మగువ కెపుడు
కుసుమమాలికరీతిఁ గొమరుగా గళమున, మూడు రేఖలు లేవె ♦ ముదితకరయ
చికురముల్ వ్రేలాడు చెన్నుదలంపంగ, మడమలునంటవే ♦ మానినికిని
తే. గీ. చారుచిన్నొప్పు చామన ♦ చాయమేను, వయసు ముప్పదిరెండేండ్ల♦వరకునుండు
పాదవుఁబొట్టియుఁగాక న♦న్నొప్పలియుండు, బాలగుణజాల ఘనలీల♦వరసుశీల. 11

అదిగాక మీమాతయు నేను గవలలమగుటచే మాకిరువురకు నొక్క పేరే యిడినారు.

చంద్ర—(ఆశ్చర్యమును విచారమును మనంబునం బెనంగొన) ఆహా! “పుణ్యవశము దిన్ననయినచోఁ నరణ్యమునందైనను జుట్టములలపడుదురు” నుమాట నిజముకదా. (ప్రకాశముగా) మామా! ఏమని చెప్పుదు. మాతండ్రిని గూర్రుండవగు దుశ్శీలుండు నిద్దురలోఁజంపె.

సుశీ—(ఆశ్చర్యముతో) దుశ్శీలుఁడాతని పినతండ్రి కొమారుఁడెగదా! అటుల గావింప జేయుటలాడెను.

చంద్ర—అతఁడు పగదారాధబాహు హరణుండై యూరివారలం బాధింప మాజనకుం డందలి కలఁగి వానిని కారాగృహబద్ధునిగా జేయ భటుల కాజ్ఞయొసంగెను. ఈ వృత్తాంత మాతఁడు తెల్లంబుగా నెఱింగి నాటిరేయి మందిరముం జొచ్చి యందు నిదురించుచున్న మాతండ్రినిం జంపి మాతల్లింజేపట్ట నుంకించె.

సుశీ—(కోపముతో)

శా. ఏమేమీ వెఱపింతలేక నెదజే ♦ యెట్లాడె దుర్మార్గ ధీ
కామక్రోధమదాంధకార తులువా ♦ గర్వాతిరేకాకృతా
యీమర్త్యేశుపదంబునం బెఱగియ ♦ న్యాయంబుగా ద్రుంపుటల్
పామున్ బెంచగ కాళ్ళుపీకుకరణి ♦ న్పాపాత్మనీకృత్యముల్. 12

కానిమ్ము. దుష్టా ! నీరోజు దగ్గరకు వచ్చినది. నేనిప్పు డెన్నికేకలు వేసినను లాభమేమి ? కంఠశోషే గాని. అటుపైని యామెదుస్థితియేమయ్యె.

చంద్రి—ఏడువనారంభించెను. మాయన్న యదివిని క్రిన్ననంబొస్సునుండి డిగ్గి ఖడ్గము బూని వానిఁ జంప యత్నింప వాఁడదలింగి మమ్ముల నిర్ధరిని గానసమందు దిగటార్చుఁడని తలవర్లకొసంగెను. అందులకు మాజనని కడుగుంది జలరాశిలోఁ జొచ్చెను.

సుశీ—(విచారముతో)

సీ. మిన్నొక్క పెట్టున ♦ మీదపడ్డనుగాని, ధైర్యంబువిడనియు ♦ దారమతులు
లేని నేరముపన్ని ♦ మానవాధము లెల్ల, దూషింపరోషంబు ♦ దొరనిబుధులు
కలిమిగలదనుచు ♦ గర్వించిపరిజలకు, హాదిజేయనియట్టి ♦ మానఘనులు
బలవంతముగతమ్ము ♦ పైబడిమోదిన, కినుక జెందని యట్టి ♦ కీర్తిధనులు
తే. గీ. కటకటారొంచనొకచిల్లి ♦ గవ్వకైన, మారకుండెడుదుష్టుచే ♦ మాన్యవరుల
కట్టియాపదఘటియిల్లె ♦ నేమనందు, కనఁగచిన్నచిల్లికినోడ ♦ మునిగినటుల.

ఇప్పుడు నేవిచారించ లాభమేమి ? మీయన్నయేమయ్యె.

చంద్రి—మమ్మునుజంప యత్నించిన తలారి దైవికముచేఁ దనకత్తి తన కుత్తుకకేఁ దగులమృతినొందెను. అంతటఁ గాంతారంబున మేమిరుపురమును చరించుచుండ నే మూర్ఛనొందితిని. మాయన్న యెటకుబోయెనో, ఈబోయ మీయన్నను జూపెద నని మాయోపాయము పన్ని నన్నీకాళికకు బలియిచ్చుటకుఁ దెచ్చెను. మీరడ్డు పడితిరి.

సుశీ—(కోపముతో) ఔరా దుష్టులా ? దుర్గుణగణ జనపాలా ! క్రూరా ! ఛండాల

చ. ఎఱుఁగవొ నాభుజాబలము ♦ నేటను మ్రగ్గిన నేడ్తవేగిసం
బరుగిడిమూఢమాతులము ♦ బ్రాఫుగఁజేకొని నిల్చియుండిసన్

దురమున నిన్నుబట్టి తల ♦ దుంచకయుండిన నాదుపౌరుషం
బరయఁగఁ గాల్వనే యొడలు ♦ బాయనె మీస మిదేలకాల్పనే. 14

(అని ఆమెతో) అమ్మా! పోదము. మీయన్న నరసీ యాదురాత్ముని మద మడంతము.

(అని యామెచేతిని బట్టుకొని యిర్వురు నిష్క్రమించుచున్నారు)

తే. గీ. అవని నయినాపురపు బాప ♦ నార్యునకును
సేలకంటి సుందరరామ ♦ శీలుమనుమఁ
డైన సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత. 15





# లాల్ గోహార్

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## షష్ఠాంకము.

### ప్రదేశము—వింగుర్లాకోట.

జయ—(కోటను కొంతదూరములోనుండిచూచి) ఆహా! దారితప్పి యిటవచ్చితిని. ఇదియెద్దియో. మహారాజపురమువలె నున్నది.

[విచారముతో]

నలసగతివృత్తము. చెలియలను గానము ♦ చెంతవిడిచేనన్
సలిలముల కేగినది ♦ జాడఁగనలేకన్
కలఁతమదిజెంది యతి ♦ కష్టములపాలై
సలలితపుప్రోలుదరి ♦ పాలమునుగంటిన్. 1

ఆహా! నా ముద్దుచెల్లెలుగు

కవిరాజవిరాజితము.

మదగజయానను ♦ మంజులభాషిణి ♦ మానధనాగ్రిణి ♦ మానినినిన్
వదనసరోజను ♦ పంకజనేత్రిను ♦ భవ్యసుకీర్తిని ♦ బాలను నే
వదలితిగండక ♦ వ్యాఘ్రమృగేంద్రశి ♦ వాళివరాహస్ల ♦ వంగతతిన్
ముదమునఁగావలె ♦ ముద్దులసోదరి ♦ మోహనరూపుఁడ ♦ మోదకరా. 2

ఆహా! ఉ. పోదమటన్నదారిఁగని ♦ పోల్చగజాలనిఁకేమిచేతునే
మాదిరిగాంచువాఁడవన ♦ మధ్యమునందున నేరుదిక్కు—హా
సాదరబుద్ధిపీడుచును ♦ జయ్యనఁ జేరితి నిట్టిచోటనా
గాదిలిచెల్లెలేమగనో ♦ కట్టడిసైతినిగాద దైవమా. 3

అన్నన్నా! ఇప్పుడు నేచేయవలసినదేమి,

సీ. చెలియలనీమార్ఫ ◆ దెలుపఁగ నేనెంచి, వారికైయే తెంచి ◆ దారితప్పి
వచ్చితికిచోట ◆ వనమున నేమైతొ, క్రూరమృగావళి ◆ కుక్షిబడితొ
దాహంబుచేనను ◆ త్యాగంబుచేసితొ, బందెగాండ్రిరచేత ◆ పట్టువడితొ
తెలివొందినాకయి ◆ నిలపించుచుంటివో, యటవిమధ్యంబున ◆ నడలుచుంటొ

తే. గీ. ఆకటవస్తుపుఁజేసేత ◆ నర్థియందు, విపరీతమైచినభంగిని ◆ నివ్వపినమందు
విడచివచ్చితి నావంటి ◆ వెడఁగుగలఁడె, నేమిసేయుదు నేమందు ◆ నెందుఁజొత్తు. 3

(అని కొంచెము ధైర్యముదెచ్చుకొని) ఇఁక మించినదానికి చింతించిన లాభమేమున్నది? కాదలఁచిన పనికాకమానదు. (కోటకుఁ గొంచెముదగ్గరకేగి విస్మయముతో) ఇయ్యది చూడగనే నాకు.

సీ. పనుపినజనకుని ◆ సంప దబ్బినయట్లు, కడలిఁజొచ్చినతల్లిఁ ◆ గాంచినట్లు
దుర్గమునవిడిన ◆ తోబుట్టు గనినట్లు, దుష్టదుష్కీలుని ◆ దునిమినట్లు
పాదుపచివులతో ◆ నగరమేలినయట్లు, యన్యదేశపురాజ్య ◆ మబ్బినట్లు
నీతిమంతులచేత ◆ ఖ్యాతిబొందినయట్లు, కష్టచయము ◆ నేటఁగలపినట్లు

తే. గీ. తోఁచుచున్నది యీసాల ◆ గాంచగానె, సత్కృతముదిన్నదైనచో ◆ సఫలమాద
వనితలంపుమున్నమ ◆ తాఁ వ్యధిపతులు, దుఃఖములొందిరాజ్యమ్ము ◆ దొడరలేద.

కావున వారుగూడ నిట్టియిక్కట్టులువడని సుఖమునొందు రోజులుదాపయినవని తలంచెద (కొంచము దూరమరిగి) ఏమి? నామూఢత్వము.

తే. గీ. పుట్టుకేగుర్తియటులైన ◆ మూఁగయూప
యునిబధిరుండటగాకద ◆ రిదుర్గిఁడెంచ
కుంటియెన్నఁగ కుష్ఠుడా ◆ కోఁడెకాఁడు
పృథ్వినేకచరించుగా ◆ నేలుటకును
తలఁచియత్నించుభంగి నా ◆ తెలివిదలఁప.

(కోటదగ్గఱకేగి) ఔరా! ఎంత విచిత్రముగనున్నది.

సీ. ప్రాకారప్రాకార ◆ ప్రాసాదములకీవి, యంబరవీధికి ◆ నంటియుండె
ఖాతమఖాతమై ◆ కల్లోలకూపార, కల్లోలముగ◆జుట్టు ◆ గదసియుండె
ధూళికుట్టిమములు ◆ హేళినద్దినలను, శృంగిశృంగములన ◆ నెగసియుండె
గోపురగోపుర ◆ గోపురాకృతులులో, చనములకును గోచరములయ్యె

తే. గీ. భళిర! విస్మయంబయ్యెనీ ◆ పరిధిఁజూడ, నహహపాలించునట్టియా ◆ యధిపుభాగ్య
సుమర గణుతింప నమరవిద్యాధరాహి, సిద్ధసాధ్యులకలవియే ◆ బుద్ధిదలఁప.

(అని దగ్గరకుఁ బోయి) మాయురే? ఇదియంతయు నా బ్రతుకువలెనే మాయగా నున్నది. ఇది నిర్జనప్రదేశముగా నున్నయది. కాదు కాదు. నిర్జనప్రదేశమయినచో నంత శుచిగా నుండునా? లోపల జనంబులుండవచ్చును.

ఉత్కళిక. ఘనుఁడు సజ్జనసన్నుతుండును ◆ ఘనజనావళిపరివృతుండును
శాతకుంభకిరీటయుక్తుఁడు ◆ కాంతివక్త్రవిశాలనయనుఁడు
సుగుణపూజ్యుఁడు నమితతేజుఁడు ◆ విగతదూష్యుఁడు సత్యభాషుఁడు
నైనయానృపుఁ జూడవేఁడెద ◆ నాదుదుఃఖముఁ దెల్పఁగోరెద. 7

సౌభాగ్యమెట్లుండెనోగదా. వామలోచనలకు వామలోచనంబును, పురుషులకు దక్షిణనయనంబును నదరినచో మేలుకలుగునందురు. ఇప్పుడు నాకు కుడినేత్రంబదరుచున్నది. ఏమిలాభము కలుగునో!

(అని లోపలఁ బ్రవేశించుచున్నాఁడు.)

[ఆకోటనుండి మంత్రి, జయచంద్రుఁడు, ఇద్దరు భటులును, నలుగురు వారకాంతలును, కోటద్వారముయొక్క ముంగలకు వచ్చుచున్నారు.]

మంత్రి—ఆర్యా! నేనీ దేశాధీశుని మంత్రిని. నా పేరు శ్రుతిశర్మ.

అశ్వగతి. పంతులువారెవరు బంధులు ◆ వంశము దేశమునున్
సంతసమొప్పఁగఁ దెల్పుఁడి ◆ శాంతముగా మతి యీ
చెంతకు రాఁబనియేమికో ◆ శీఘ్రమె చెప్పుమిమా
కంతయుఁ జూడఁగ మిమ్ములఁ ◆ గౌతుకమయ్యెఁగదా.

జయ—(మంత్రిదెసఁ జూచి విచారముతో) సచివాగ్రణీ! నన్నేల దుఃఖవారాశిలోఁ బారవేసెదవు. నా బ్రతుకు నా సంగతి విన్నవారికిఁ గన్నవారికిఁగూడ విచారము కలిగింపకపోదు.

శ్రుత—ఆర్యా! తమకీవిచారమేల? సాధ్యమైనంతవఱకు తమదుఃఖనివారణమునకై ప్రయత్నించెదము. కావున నాతోఁ గొంచెము సెలవిండు.

జయ—(విచారముతో)

ధ్రువకోకిల. ప్రణుతసజ్జనసన్నుతుండు ప్ర ◆ భాకరాఖ్యుఁడు దండ్రి మా
జనని భూనుతశీలచారువిశా ◆ లనేత్రి సుశీలమా
యనుఁగుఁజెల్లెలు చంద్రరేఖను ◆ భూరి రత్నపురంబునన్
జననమొందితి ధీమణీ జయ ◆ చంద్రుఁడన్ నృపపుత్రుఁడన్.

వారకాంత—(తోడివారితో) ఈతఁడు రూపలావణ్యములలోఁ జయచంద్రుని జయించినవాఁడే!

రెండ—అందువలనె యా పేరు వచ్చినది.

మూఁడ—నెచ్చెలులారా!

ఉ. కన్నుముఖంబు హస్తపద ♦ కాంతుల సంతతి కెంతయుఁ దగన్
జన్నగ నోటు జెంది జల ♦ మధ్యమునందునఁ జొచ్చెఁ బద్మ మ
న్నన్న విలాసమా సొబగు ♦ నారయ యారము జన్మమధ్యమం
దెన్నఁడు గాంచలేదిఁక ను ♦ నెన్నఁడుఁ గన్గొన మిట్టి బాలునిన్.

శ్రుత—మహారాజా! ఇటరాఁబనియేమి?

జయ—అమాత్యరత్నమా! ననుఁ దిరుగ దుఃఖసముద్రములో ముంపదలంచితివా!

శ్రుత—బాలకా! అయ్యది నా యభిప్రాయముఁ గాదు. రత్నపురీశుండగు ప్రభా
కరుని గారాబుపట్టివయి చెట్టులేక పాదచారివై యిటువచ్చుటకుఁ గారణంబడిగితి.
అంతియేకాని మఱియొండులకు గాదు.

జయ—(విచారముతో) నా యవస్థ నేమి చెప్పుదు.

సీ. జనకుండు నడిరేయిఁ ♦ బినతండ్రిపుత్రుచే, స్వర్గస్థుఁ డాటకుఁ ♦ జాలఁ గుంది
జననిప్రాణము బాయ ♦ జలధిలోఁ జొచ్చె, నన్ను నా చెల్లెల ♦ నలుక నెంచి
తలపరివిపినమధ్య ♦ మునకుఁ గొనిపోవ, దైవయోగముచేతఁ ♦ దానెమడ నె
ముద్దులతోఁ బుట్టు ♦ మూర్ఛవోవఁగ నటఁ, జలముల కొలఁకున్నై ♦ కొలను చెంత
తే. గీ. కరుగ నెంచి యేగంగ మా ♦ ర్గంబుఁ దప్పి, యీ పురిని కోటదరిఁ జేర ♦ నృపుని జూఁడ
బుద్ధిరొదమంగ వచ్చితిఁ ♦ బుణ్యపురుష, యకట! చెలియ లేమయ్యెనో ♦ యటవియందు

(అని కన్నీరు నింపుచున్నాఁడు.)

శ్రుత—రాజా! యెట్టివారలకయినను గష్ట సుఖములు, కలిమిలేములు కలుగుచుండును
గదా. అందలి కలిమి సుఖములకు సంతసించి లేమి కష్టములకు విచారమొందరాదు.
రెంటిని సమానముగా జూడవలయును. అదిగాక,

తే. గీ. మున్న భాస్కరాన్వయమందు ♦ బుట్టినట్టి
యుర్వపతులెల్ల గష్టము ♦ లొందితుదకు
సౌఖ్యము లొందిరి యేలె రా ♦ జ్యమ్ము గాన
వారివలె నీవు సుఖములు ♦ వడయఁగలవు.



యిందులకయి యింతగుందనేల? ఇయ్యది మీ వంశపరంపరా వచ్చుచున్నదియే కాన
నా కోర్కె నెరవేర్చితి రేని మీ కష్టములు గట్టెక్కగలవు.

జయ—నా వలనయినచో శీఘ్రముగా నెఱవేర్చెద.

శ్రుత—(విచారముతో)

సీ. ఏసార్వభౌముని ♦ సెడయక చేపట్టె, కవితకన్యాతల్లి ♦ గల్పవల్లి
ఏసార్వభౌముని ♦ సెడయక చేఁబట్టె, సిరికిబట్టంపుచేడి ♦ చిగురుబోఁడి
ఏసార్వభౌముని ♦ సెడయక చేఁబట్టె, ధైర్యసాహసరమా ♦ ధుర్యగరిమ
ఏసార్వభౌముని ♦ సెడయక చేఁబట్టె, దానగుణస్ఫూర్తి ♦ ధర్మకీర్తి

తే. గీ. యట్టికీనుతమూర్తి నకీలుఁ♦దలఁచునృపుఁడు, దైవగతిచేత మతిలేక ♦ దనదురాజ్య
మంతవిడనాడికాంతార♦మధ్యమందు, దిరుగఁజొచ్చెను విధివ్రాతఁ♦ద్రిప్పవశమె.

కావున నమ్మహానుభావుని రాజ్యలక్ష్మికి మేమేర్పరచుకొన్న కాలనిర్ణయప్రకార మెవ్వరయిన నీద్వారములోఁ బ్రవేశించినచో రాజ్య పట్టాభిషిక్తునిఁగాఁ జేయ సెంచితిమి.

జయ—(ముఖవికాసముఁ జేయుచున్నాఁడు)

[పరిచారకుఁడు లోననుండికిరీటమును దీసికొనివచ్చి మంత్రి కిచ్చుచున్నాఁడు.]

శ్రుత— మయూరరుతము. శ్రీపతికృపచేన్ మాభాగ్యమునన్
చింతలబాపన్ జేరితిరిటునన్॥ శ్రీపతి॥
భూపకులాగ్రణి రససరసాగ్రిణి
భూపుణ్యాగ్రిణి బుధలోలాగ్రిణి॥ శ్రీపతి॥
మాపయిభారం మాకువిచారం
మాకిఁక లేదే మీదే కాదా॥ శ్రీపతి॥
నృపవరకీలా రాజ్యమివ్వేళ
యిచ్చితిబాలా యేలుకో లీలన్॥ శ్రీపతి॥ 14

[అని కిరీటము శిరముపైనిడ బోవుచున్నాఁడు]

హారకాంత—(తనతోడివారితో) ఆహా!

తే. గీ. డంబుగానీనృపునకుఁబ ♦ ట్టంబుఁనిడుట
తిక్కలకు సేనికాంతిని ♦ ధిక్కరించి
విరియఁబారిచూపరులకుఁ ♦ బ్రీతినిడెడి
పూవులకుఁ దావియొనగూడు ♦ పోల్కగాదె. 15

రెండ—చాలుచాలు. ఇదియేనా నీసరసోక్తి వారకాంతలింక నెంతమోవింతగమాట లాడుదురని పరనులమకొను పలుకులు వృథాజేసితివి. ఇదివిను.

తే. గీ. రాజ్యలక్ష్మిని బొందుట ♦ రాజసుతుడు
[illegible]లసౌభాగ్యసంపద ♦ సౌఖ్య మిడుచు

సెల్లరను దళ్లీరీతి ర ♦ క్షించునట్టి
యిందిరను బొందు నావిష్ణు ♦ చంద మబల. 16

మూడు—(రెండవవారకాంత వైపుచూచి బుగ్గలుపొడచుచు) చాలుచాలు నీద్వ్యర్థి కిఁజాలసంతసించినాను.

నాల్గ—ఓహో! రాజ్యలక్ష్మియనుమాట నీనామమునకును రాజ్యమునకును సార్థద్వయముకలిగియుండుటచేతనా,

రెండ—ఎవరనుకున్నకోరికవారిని బయలుపుచ్చకమానదు గదా.

జయ—తే. గీ. నాకుపట్టాభిషేకంబు ♦ వీకతోడ
చేతునంచును దెగువతోఁ ♦ జెప్పుమాట
"మంగలికిఁబ్రిధానత్వమె ♦ సంగినట్టు"
లనెడునానోక్తికిగదసచి ♦ వాగ్రిగణ్య! 17

శ్రుత—ఈరీతిని సెలవిచ్చుట మీవంటి బుధాగ్రేసరులకు ధర్మమే నా? మీరు రాజ్యపరిపాలనకర్తలుగనుక నే మే మేర్పఱచుకొన్న కాలనిర్ణయములో నీపాత్రికారద్వారముగుండ దైవము మిమ్ములఁ బనిచినాడు.

అదియునుంగాక. తే. గీ. ఆదిశేషుని శిరముపై ♦ నవనితలము
మోయువలె నున్న ఫణులెల్ల ♦ మోయుగలవె
యటులె భూభరంబును సెప్పు ♦ యధిపశ్రేష్ఠు
లేలవలె నున్న నరవరు ♦ లేలఁగలరె. 18

(అని కిరీటము శిరముపైనిడి మంత్రి కూర్చుండినాడు)

వారకాంతలు—జే జయచంద్రమహారాజా!

పంచచామరము, ముక్తపదగ్రస్తము.

సురేంద్రవైభవా బుధాళి ♦ స్తోత్రపాత్రభూవరా
వరా యశోకహార ధీర ♦ వైరిసంహారాహరా
హారపూర్ణ పూర్ణకీద్య ♦ హంసవంశభానురా
సురాహతుల్యగాత్రగాయ ♦ శోభనానుభాషణా. 19

తోటకవృత్తము. జయచంద్రునకున్ సుగ ♦ సాంద్రునకున్
భయహీనునకున్ జయ ♦ మంగళమో
నయవిద్యునకున్ జన ♦ నాథునకుం
బయకారునకున్ శుభ ♦ మంగళమో. 20

(అని మీఁదపుష్పములుజల్లి నృత్యమును జేయుచున్నారు.)

జయ—శబ్బా! బాగుగనున్నది.

ఉ. సుందరులార! మీఁదగున ♦ చారు చమత్కృతి వీణానాదముల్
పొందగ నాటపాటలయి ♦ పొల్పెసలారెడు జావళీల్ కృతుల్
మందర మెచ్చు చున్న నటన ♦ మద్భుతిమున్ గనుసైఁగలున్ బలే
నందను పొందుచున్నదివి ♦ నంగనె దుఃఖము బాసినామదిన్. 21

వారాంగనలారా! నృత్యముచాలు.

శ్రుత—రాజుగారియొద్ద సెలవుఁ దీసికొని మీమీమందిరములకుం జనుఁడు.

వార—మహారాజా! సెలవు.

జయ—మంచిది.

(వారకాంతలు నిష్క్రమించు చున్నారు)

జయ—(మంత్రి నుద్దేశించి)

తరల. కలవు నామది రెండు కోర్కెలు ♦ కామసన్నిభరూప నీ
వలనఁ గావని యంటివేనియు ♦ వచ్చుదారిని బట్టిపో
దలఁచినాఁడను నమ్మనీమదిఁ ♦ దక్షణంబ యొనర్పఁగా
వలయుఁ గావునఁ జెప్పెద న్వినుము ♦ వారకన్ సచివాగ్రణీ! 22

శ్రుత—రాజా! మీ యిచ్ఛకు వచ్చిన తెఱంగున వర్తించువాఁడను. అది యెద్దియో సెలవొసంగుఁడు.

జయ—తే. గీ. వినుము చెల్లెలి విడచితి ♦ విపినమందు
బంటులను వేగఁ దోడ్తేరఁ ♦ బనుపుటొకటి
తక్షణమ్ము దుష్టులపై ♦ దండువెడల
కార్యము రెండవదినుమ్మి ♦ ఘనగుణాఢ్య! 23

శ్రుత—ఆర్యా! అదియెంతపని. ఇప్పుడే తమకోర్కెలు నెఱవేర్చెదను. రండు కోటలోనికిఁ బోవుదము.

(అని యిరువురు నిష్క్రమించు చున్నారు)

తే. గీ. అవనిగుణానుర్యకోట యు ♦ నంతశాస్త్రి
పర్యవకు గూర్మి శిష్యుఁడై ♦ పరులుసట్టి
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
నాయఁబడె నిదిభూమిపై ♦ పరలుగాత. 25





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## సప్తమాంకము.

### ఉద్యాన వన విహారము.

[బాలికలు బంతులుదూలించుచు నొకరివెంబడినొకరు ప్రవేశించుచున్నారు.]

కమల—(తోడివారితో) ఇప్పుడెన్నిగంటలయినది.

రేవతి—సాయంకాలము నాలుగు గంటలయినది.

కమ—ఓసెచ్చెలులారా! మనము చెండ్లాట మానినైచి యీపుష్పవాటికలకు నీరుపోయవలెను.

చెలికత్తెలు—మంచిది. (అని బంగరుకలశంబులు చేతితోఁబుచ్చుకొనును)

రేవతి—అక్కా! నాకామొలకల పేర్లను బ్రత్యేకముగాఁ జెప్పుము.

కమల—మంచిది.

సీ. కేసరీ మధ్యరో ♦ కేసరి యయ్యది, తిలపుష్పనాసిక ♦ తిలకమదిరొ
అంబుజవదనరో ♦ యంబుజమలది, చంపక పరిమళ ♦ చంపకమిది
కర్కగంధద్వయీ ♦ కరకమదేకము, గుణగుణాతీత ♦ గణికమదిగొ
పౌండ్రకలోచన ♦ పుండ్రకమియ్యది, సుమనఃమనోహరీ ♦ సుమనమిదిరొ

తే. గీ. అల్లవేదూడు కరవీర♦యామ్రమబిల్వ,నకుళవంజుళ చాంపేయ♦పనసజంబు
పారిజాతకస్యందన♦శారదాది, పుష్పరస పరాగములతో ♦ పొల్పెసంగు. 1

అదిగాక.

లయగ్రాహి. చెల్లెలరసాల మది ♦ యల్లజను పాంథులకుఁ
జల్లగను నీడలిడు ♦ నల్లమదెలర్చక
కొల్లలవె మల్లికమ ♦ తల్లికకదంబమదు,
సెల్లి బదరీవకుళ ♦ వల్లరిసులమ్మొ

మల్లెలు సమీరణను ♦ మొల్లలు సుజాజి విరు,
లెల్లను సువాసనలు ♦ జెల్లును గడమ్మా
యొల్లెడలఁ జూచినను ♦ వల్లరిలు వల్లులును,
నల్లుకొనియున్న పొద ♦ రిళ్ళు గనుబాలా.

(నీళ్లు పోయుట నభినయించుచున్నారు)

లయవిభాతి.

రోహిణి— సెలసె విరజాజివిరుల ♦ లలిఁ దిలకించు మది
నలు దెసలఁగ్రమ్మ యల ♦ సలపునిరువయ్యెన్

శ్యామ— మెలఁతపొదరిళ్ళు మన ♦ యలతలనుబాపుటకు
సెలఁతి సెలవయ్యెఁగదె ♦ నళినపదయోషా

సుందరి— పొలఁతిమరుకేళికిది ♦ చెలువమగునీకునిటఁ
గల లతలువల్లరిలు ♦ జిలిబిలిగ నుండెన్

(అని శ్యామలను బరిహసించుచున్నది)

శ్యామ— చెలివయసుగుబ్బలన ♦ వలపువిటకాండ్రగవఁ
గలయు టదిగల్గె పెఱ ♦ పలుకులిఁక సేలన్. 3

(అని నవ్వుచున్నది తోడివారు చపేటలుకొట్టుచున్నారు.)

కమల— వీవీపరిహాసములకేమిగాని.

సీ. ఆకసంబనులక్ష్మి ♦ కందిలకై పైడి, పారసికరఁగు కుం ♦ పటియనంగ
సుకలురక్కసులును ♦ సురకుఁబోరాడఁగ, సమరభూమిని గాలు ♦ క్షతజ మనఁగ
గగనమండపమను ♦ కల్యాణవసతికి, సింగారముగఁ బూయు ♦ జేగురనఁగ
చూపఱ్ఱమదులకు ♦ సొబగుగాగన్పించు, ప్రాచినమోదుగు ♦ పూతయనఁగ
ఆ. వె. తోచుచున్నతాల్చె ♦ తోయజమిత్రుండు, తనదు రాణిఁ బొందు ♦ తలఁపు హెచ్చి
వడిగఁ జేరితోడ ♦ పశ్చిమసాంద్రంబు, జేరుచుండె గనుఁడు ♦ చెలియలార. 4

కావున మనమాలసింపరాదు. వెంట నీపూవులఁ దునుముకొని యింటికిఁ బోవుదము.
(తోడివారు) మంచిది. (అనికలశము లచ్చటనుంచి పుష్పగుచ్ఛములఁ గోయుట మొదలుపెట్టిరి.)

హయగతిరగడ.

కమల— రా మరమ్మిటు గుండకొమ్మల ♦ రాజరాజిలుచుండె గాంచుము
(అని చెలికత్తెలకుఁ జూపుచు మల్లెమొగ్గలు గోయుచున్నది.)

రేవతి—శ్యామచామపత్రిపాళిరక్తిమ ♦ సారసౌరభ మెంచుమెంచుము

(అని పగడపుఁగాయలనుగోసి శ్యామలకుఁజూపుచున్నది.)

సుందరి—బాల బాలసమీరణంబిదె ♦ ప్రియప్రియముగా నలందెదము

(అని మణిమాలకు మల్లెతీఁగెలను జూపుచున్నది.)

మణి—లీల లీలప్రసూనముల్ నవ ♦ లీలలీలగఁ గోయుమందును

(సుందరితో ననుచున్నది.)

కమల—చెలియచెలియలగంధఫలిబల్ ♦ చెలగి చెలఁగు చునుండెఁగనుమది

(అని చెల్లెలకుజూపుచున్నది)

రేవతి—చెలువచెలువముఁజూడుసంపెంగ ♦ జిలుగుజిలుగుకెంబూ చెనమ్మది

(అని అక్కయైన కమలకుసంపెంగచెట్టుఁజూపి పూవులు గోయుచున్నది)

శ్యామ—వామదామరోపారిజాతము ♦ సన్నసన్నలుగులుకు శ్రీయము

(అనిరోహిణికిఁ బారిజాతభూజమును జూపి పూవులుగోయుచున్నది)

రోహిణి—చామజాతివి శేపముగ సిర ♦ జాజిజాజులుగ్గోయుమందుము.

(అని శ్యామలకుఁజూపి సిరజాజిపూవులుఁ గోయుచున్నది.

కమ—చానజాణరో గైకోనఁగదె ♦ చాలమేలగు సూనముల్ నివి

(అని పుష్పములు సుందరికిచ్చుచున్నది.)

సుంద—వీణగానాదివినోదినీ యీ ♦ పికపికంబుల నాదమదివిను

(అని రసాలసాలమీఁదికోయిలలనుఁ జూపుచున్నది.)

మణి—మదనసదనవె యాఘ్రాణించుము ♦ మరువకురువసువాసనంబులు

(రేవతికి మరువ కురువ పత్రినిగోసి యిచ్చుచున్నది)

రేవతి—పదపదల్లదె పట్టిచూడుము ♦ బాలమాలతిపుష్పచయమును

(మణిమాలను కొంచెముదూరము దీసికొనిపోయిమాలతిపుష్పముల కేతికిచ్చిచూపుచున్నది)

శ్యామ—చారుసారసముఖము సేలెదు ♦ సరసరసమణిదమన మదిగను

(అని రోహిణికి దమనముగోసి యొసఁగుచున్నది).

రోహి—దూరబారుల నడకదిద్దకు ♦ తొయ్యలియ్యది దుఱుముఱుమున

(శ్యామలకు దమనమును గొప్పననుంచుచున్నది)

సుందరి—నీబ్బిగుబ్బెతవిరులువేత్రిటులు ♦ చెడి పీడకకానుకొమ్మిక

(అని మణిమాలను పుష్పచయముచే కొట్టుచున్నది)

మణి—యబ్బెబెబ్బెరీతినుంటివి ♦ యాగ్గుమాగుము నాతో సరసమె

(అని పారిపోవుచున్నది)

శ్యామ—యేదియేదిటు తిరుగుమా నా ♦ యేటుకేటుకు పారిపోయెదు

(అని సుందరిని బుప్పములచేఁ గొట్టుచున్నది)

సుందరి—మీఁదిమీఁదికి వచ్చుచుంటివి ♦ మున్ను మున్నుగాన కటునిలు

(అని శ్యామలను విరులచే గొట్టుచున్నది)

శ్యామ—మాటలేటికి చేతనైనచో ♦ మారుమాఱ్కొని తిరుగపోదుము

(అని సుందరిని తిరుగబుప్పములచే ముంపుచున్నది)

సుందరి—బోటి మాటిగ మూవముల్తి ♦ మీటి గోటడగింతు నిల్వనె

(అని శ్యామలను మఱింతపుష్పములచేఁ గొట్టుచున్నది)

శ్యామ—కాలుగాలిన పిల్లికైవడి ♦ గంతుఱంతులు నై చిదేలకో

(అని కోపముతో నుడికిపోయి బల్కుచున్నది.)

సుంద—పాలిలుమాలిని పల్కులేటికి పట్టుబట్టుము నాతో వేగమె

(అని కచ్చబిగియగట్టుచున్నది)

కమల—తాళుతాళు డిదేటివాక్కులు ♦ తప్పులొప్పులు గానకుండగ

(అని సుందరిని దూరముగా గెంటివైచుచున్నది)

రేవతి—చాలుచాలును నెంతలోపల ♦ సరసము ల్విరసములు జేసిరి. 5

(అని శ్యామలను దూరముగా గెంటివైచినది)

కమల—(తోడివారితో) అదిగో! మా దాదియగు చంద్రిమణి పంటకములం దెచ్చుచున్నది. మనమా పూపొదరింట నెంగటఁగూర్చుందము రండు.

తోడివారు—మంచిది. (అని యందఱుఁ గూర్చుండిరి)

చంద్రిమణి—(ప్రవేశించి) అమ్మా! ఇదిగో! తినుబండములు మీ సవతితల్లిగారు యిచ్చినారు.

కమల—చెలియలా వీనిని దీసికొనుము.

రేవ—మంచిది. (అని తీసికొని) యీ పెద్దమిఠాయి యుండ యెవరికి?

చంద్రి—మీయక్కగారికి.

రేవతి—(అందరికి నిచ్చుచున్నది)

చంద్ర—అమ్మగారు త్వరగారమ్మని యాజ్ఞాపించినారు. సెలవుఁదీసికొనిపోయెద.

కమల—మంచిది.

చంద్రి—(నిష్క్రమించుచున్నది.)

శ్యామ—(మిఠాయిచేతిలోఁ బట్టుకొని సుందరినిఁజూచి)

చం. తలఁపగనీదుచామలకు ♦ దథ్యముపాటిగ నున్నదే కదా
యిలపయి రెండుపట్టుపలె ♦ యీడగు రూపమునందు గాని యిం
దుల నిదిమాకు ప్రేమనుమి ♦ తోరము గాఁగను పన్నెకాండ్రికున్
గలుగదనీయురచ్ఛేదము ♦ గాంచినచో నెదయందు సుందరీ.

సుంస—(కొంచెముకోపముతో) ఔనౌను.

ఉ. ఎచ్చటనున్న పూవుపొద ♦ రిందులయందున సందుగొందులన్
గెచ్చన డొంక దేవళము ♦ గేదగి చెట్లను నాదువాస మే
మచ్చర మెచ్చి పేర్లెదవు ♦ మాటలు నేర్చితి నందుచాలు ఛీ
పుచ్చటికంబుపీడిభువి ♦ పుట్టుటకంటెను జావు మేలకో. 7

(అందరు నవ్వుచున్నారు.)

రోహి—ఏమిటీ మొన్నటి సాయంసంధ్యవేళ,--

ఉ. కచ్చలుపీడిపోవఘులు ♦ ఘుల్లనియుందలు మోర్వియఁ బైటలో
మచ్చరిచాదినోయిచుతి ♦ మంపుగ నాట్యము నాడముంగురుల్
హెచ్చుగ మోము పైబరియ ♦ నెవ్వరు చీరిన మాటలాడకన్
పచ్చుట నీదు చేష్ట లిపు ♦ వాఁక చూచెదు వా రెఱుంగరే. 8

మణి—మొన్నటిసాయంసంధ్యా ప్రశంసయేల నిన్నటి మధ్యాహ్నకాలమున రెండవ యామము వేళ,—

ఉ. వాడినమోముతోడ నెలి ♦ వాలికకన్నులతోడఁ జంపకున్
వీడినకొప్పుతోడ మెయి ♦ వీడినసొమ్ములతోడ యూర జ
వ్వాడెడుకొనుతోడ నెదఁ ♦ బాసిన పయ్యెదతోడ మేనునం
గూడినధూళితోడఁ గను ♦ గొంటిని పూపొదరింట నెంగటన్. 9

క. ఆరూపు రేఖ సొగసే, వారలుగన్న నిజమీయు ♦ పతిమారునిబల్
కూర్పిరశరవార్తము చే, నీరీతిందన రెనంచు ♦ నెంచరె మదిలో. 10

రేవతి—ఇసీ. సిబ్బితలేక మీకడుపుబ్బుతనంబుచే నోటికివచ్చినట్లు మాటలు పేర్లెద రేల! మిన్నకుండుడు. పుట్టినది యాడుపుట్టుక కదా!

క్షమ—చెల్లెల రేవతీ! నా నాలుక జిలజిలమని లాగుచున్నది. దాహము మిక్కుటముగా నున్నది. ఇక జీవము నిలువనట్లు తోచుచున్నది.

(అనిపడుచున్నది.)

రేవతి—చీ! రోహిణి. మాయక్కగారికి మిక్కుటముగా తృష్ణగలిగి యున్నది జలములందీనుకొని గ్రక్కునరమ్ము.

రోహి.—మంచిది. (అని నిష్క్రమించుచున్నది.)

రేవతి—(విచారముతో) ఓసఖీమణులారా! మాయక్కనోటమాట, కంటఁజూపులేక యే పడియున్నది. అదియేమో కారణము తెలియదు.

(అని కన్నీరు నింపుచున్నది)

చెలికత్తెలు—ఆహా! మరణసూచకములగు చిహ్నములు గాన్పించుచున్నవి. ఎంతలో నెంతకష్టదశ ప్రాప్తించెను. (అందరు నొక్కసారిగా)

విచారలాహిరి. ఓసఖీసఖీసఖీ ♦ బాసిపోవ మేలటే
వీసమైన జాలిలే ♦ కాపవీడఁగా మముక్. సఖీ

2. చిన్ననాటనుండి నిన్ ♦ మన్ననాలోఁ జూడఁగా!
జన్నె మమ్ముబాసి య ♦ న్నన్న నీతోఁగూర్పకన్. సఖీ 12

3. ప్రాలుమాలినట్టియీ ♦ వేల నీకుచింతగా
పూలపాన్పు జేసినా ♦ కూళ దైవ మోర్వకన్. సఖీ 13

4. వంతమేల నే యిడే ♦ చింత దీర్పగా మముక్
గాంత వేగిరంబునీ ♦ చెంత జేర్చుకోవలెన్. సఖీ 14

మణి—మన మెంత విచారించినను లాభ మేమి?

రేవతి—(కమల పైఁబడి) అక్కా!

చ. భువతిరలీల నిన్ను సతి ♦ కాంతుసు బెంచెడు తండ్రి యీపయిన్
మనుటయిఁ కెట్టులీసఖులు ♦ మానినిరో చరియింతు రెట్టు నే
ననువుగ నీదుపాదము ల ♦ హర్నిశముల్ విడనాడకుంటి నా
పనటుల సాంద్రిమందు మము ♦ వైచితి నేనికనిల్చు టెట్లొకో. 15

అదియటులుండగా.

సీ. జననికుప్తింకనదు వి ♦ చారము లేకుండ, ననువుసఁ బెనిచెఁగా ♦ నాదుతల్లి
మాతపోయిన బాల ♦ ఖ్యాతిగానిన్నిప్రీతి, ననయంబు బ్రోవదే ♦ మనదుతండ్రి
సపతి కైదోడని ♦ జనదాటి నీమాట, లెంచక నడుతునే ♦ యౌవ్వనఁడైన
ఘనముగా నీయాజ్ఞఁ ♦ గైకొనదేకదా, పనులు గావింతురీ ♦ పద్మముఖులు

ఆ. వె. కటకట! నినుఁబాసి ♦ యెటుల జీవింతు నా కేటిబ్రతుకికేటి ♦ కేటాడపురి
కేటికీ కుసుమము ♦ లేటికి నా మెడలో హార నన్నుగూడ ♦ దరికిజేర్చు.

శ్యామ—అమ్మా! యేలవిచారించెదవు.

తే. గీ. అప్పుడీటిన వస్తువె ♦ ద్దానినైన
వజ్రపేటిక నిడిముద్ర ♦ వైచి పదిల
పరచినను బోదె మనము గ ♦ న్పట్టగలమె
సఖియ నీటఁ బోయినచాప ♦ చందమునను. 17

కాఁబట్టి నీదుఃఖమును జాలింపు, ఈమె విషపూరితమైన మిఠాయి దినినటుల నా మనంబునకు దోచుచున్నయది. లేకున్న యింతలో యంతపని జరుగదు. ఈసంగతి మీ నాన్నగారికి తెలియపరచవలెను. లెమ్మ యిచ్చటనుండిన నీవిచారము మాన్ప మా శక్యము గాదు. (అని యా మహాస్త్రమునుం బట్టుకొని తీసికొనిపోవుచు (మణిమాల, సుందరివైపుఁ జూచి) మీ రిచట భద్రముగా నుండుఁడు. వాహకులను బనిచెద.

(అని రేవతితో నిష్క్రమించుచున్నది)

సుంద—అన్నన్నా! చెల్మికి సాటియగు పదార్థమెద్దియు గానరాదుగద.

సీ. ఆపదలను మహా ♦ యబ్ధినిమున్గుచో, తరణియై రక్షించు ♦ ధరను జెల్మి
యెంత మర్మమునైన ♦ మంతనమున దాఁచ, వజ్రపేటికయగు ♦ నలులు జెల్మి
యజ్ఞానమను మహా ♦ యంధకారము బాప, భాస్కరకాంతియై ♦ ప్రబలుఁ జెల్మి
యిచ్ఛానిహారేచ్ఛ ♦ స్వేచ్ఛగా మాటాడు, ఘనుల పాలిటఁ గ్రింద ♦ కర్త చెల్మి

తే. గీ. అహహ యిట్టిసుఖంబుల ♦ కాస్పదమయి తనరు జీవముకన్నను ♦ మనల నెపుడు
కరుణతోఁ బ్రోచిరక్షించు ♦ కమలఁ బాసి బ్రతికియుంటిని నిర్జీవ ♦ ప్రతిమలట్ల

మణి—సుందరీ! యింతలో నీమె విగతజీవియగుటకు గతంబెద్దియో నీకుఁ దెలియునా?

సుంద—సఖీ! నాకేమియుఁ దెలియదు.

మణి—ఈమె సవతితల్లియగు చిత్రరేఖ పన్నుగడవలన సమసెనని నిశ్చయించెద.

సుంద—ఎట్లు.

మణి—చిత్రరేఖ కమలకు సవతితల్లియగుటచేతను, జనకునకు నీ కమలయందతి ప్రేమాతిశయంబు లుండుటచేతను, రేవతియందంచుక బాలి తక్కువగా నుండుటచేతను, నామెచే జరిగెనని యోచించెద.

సుంద—నేనును అటులనే తలంచెద (అని యిటునటుజూచి) అదిగో వాహకులు వచ్చుచున్నారు.

వాహకు—(ప్రవేశించి) అన్నన్నా! చిత్రరేఖమహిమగాని మఱియొకటిగాదు. అక
ట పసిలేనమందుఱయింతపడవారికైనను తేల్ల చనిపోరాదు.

మణి—(వాహకులతో) ఈమెను బహుజాగ్రతగా ధర్మవైద్య శాలకుంగొనిపొండు.

వాహ—మంచిది. (అని యామెను దీసుకొనిపోవుచున్నారు)

(సుందరిమణిమాలలు నిష్క్రమించుచున్నారు)

తే. గీ. కోమరిపురపాలశ్రీవేణు ♦ గోపబాల
వరపరిపాదలబ్ధకవిత్వ ♦ సరసుఁడైన
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలంగాత. 19





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## అష్టమాంకము.

### జయచంద్రుని కోర్టు.

(జయచంద్రుఁడు, కుశీలశర్మ, నారాయణశాస్త్రి వేంకటశాస్త్రులుగార్ల నిరువ్రక్కల నుంచుకొని సింహాసనముమీదఁ గూర్చునియుండె)

జయ—మంత్రిపుంగవా! నేటిదినమునఁ దీర్పవలసిన తగవులేమి?

కుశీ—దేవా! మానవవర్మగారాబుపట్టికి విషమిడి చంపినదని యపవాదుపడిన చంద్రమణికేసు విచారించవలెను.

జయ—వాదిప్రతివాదులు హాజరయినారా?

కుశీ—దేవా! హాజరయినారు.

జయ—అయినచో బిలిపింపుము.

కుశీ—చిత్తము. (అనిబంటుతో) ఓరీ ఉభయపక్షములవారిని హాజరుపెట్టుము.

బంటు—చిత్తము. (అని ద్వారము కడకువచ్చి) మానవవర్మ! మానవవర్మ! మానవవర్మ! (కేకలువేయుచున్నాఁడు)

మాన—చిత్తము. (అని రాజునెదుట నిలువఁబడుచున్నాఁడు)

జయ—నీవేనా! వాదివి.

మాన—చిత్తము.

జయ—ప్రతివాదినికూడ పిల్వుము.

నారా—దేవా! ఆమె ఘోషాస్త్రీయగుటచే నామెపై నేరమారోపణమగువఱకు నా కును రచ్చకు బిలిపించరాదు. అందులకు ధరణమెవరొసంగెదరు?

జయ—దానికిఘోషాయేమిటోయి.

వేంక—వారి న్యాయమునందుఁగూడా యిట్టిఘోషాకలదేమో?

జయ—పోనిమ్ము. వాదివాద్యాలానంతర మామెను రప్పించవలసి యుండునెడ రప్పించెదము.

కుశీ—(మానవవర్మతో) ఓయీ మీకెవరైనసాక్షులున్నారా?

మాన—చిత్తము. దేవగుప్తుఁడను కోమటి గలఁడు.

కుశీ—హాజరయినాడా?

(అంతట దేవగుప్తుడు ప్రవేశించును)

మాన—దేవా! యీతఁడే. (అని చూపుచున్నాడు)

దేవ—(మానవవర్మ చెవిలో) బాకీయవలసిన లంచమిప్పుడే ఘటనలు చేయకున్న నేను నీవు చెప్పినట్లు పల్కను.

మాన—సాక్ష్యమనంతరమున తప్పక యిచ్చివేసెదను.

దేవ—నేను సాక్ష్యానంతరమందే నీవుచెప్పినట్లుచెప్పెద. కోమటి సాక్ష్యమని రూఢిగ నవుకాఁబోలు.

బంటు—(దేవగుప్తునితో) యీబోనుపై కెక్కుము.

దేవ—మంచిది. (అని బోనుపైకెక్కుచున్నాఁడు)

బంటు—(రామాయణముఁ దేవగుప్తుని చేతికిచ్చి) శిరముపై నిడుకొమ్ము.

(అటులఁ జేయుచున్నాఁడు) మువ్వూరికి దేవునిరోఁగుట. అను (అటులనుచున్నాఁడు) న్యాయముచెప్పుతాను. అను.

దేవ—ఆ, న్యాయముఁ జెప్పుతాను!

నారా—మానవవర్మకుమార్తె యాకస్మికముగా మృతినొందుటకుఁగారణమేమి?

దేవ—విషపూరితమగు మిఠాయి భక్షించుటవల్ల.

నారా—అదియామెకెట్లు వచ్చినది?

దేవ—చంద్రిమణి పెట్టుటవల్ల.

నారా—చంద్రిమణికెట్లువచ్చినది?

దేవ—(ఊర్ధ్వదృష్టితో) ఛి. కాదు. చంద్రిమణియే స్వయముగా గొనియుండు విషమిడి యుండవచ్చును.

నారా—దేవగుప్తా! మొదట ఛి. తరువాత. కాదు చంద్రిమణియని వచించుటకు గతం బేమి?

మాన—(సంలోచనములు సవరించుకొనుచు తత్తరపాటుతో) ఇసీ! సాక్ష్యము తేలిపోవునట్లుగాదడబడుచున్నాఁడు.

దేవ—అయ్యా? నేనేమన్నాను ఛి. కాదు. తప్పు. లేదు. ఛి. అవును. కాదు. లేదు. అవును. అన్నానాయేమి? అయినక్షమింపుడు. ఒడలు కంపమొందుచున్నది. చివరమాటయే సత్యము. ఇంక సాక్ష్యమీయఁజాల.

(అని గడగడవడఁకుచు బోనుపైనుండి దిగబోవుచున్నాఁడు)

శుచిత—టుట్. దేవ్ సాక్ష్యమానంతరము గాని బోనుపైనుండి దిగుటకు వల్లగాదు.

దేవ—సరిగా నిలుచున్నాఁడు

వెంక—ఓయిభయమేల? అబద్ధపు సాక్ష్యము కనుక నా! సరిగా నాలోచించుకొని చెప్పుటకు.

దేవ—మీరెట్లుగ్రహించితిరి.

శుచిత—ఏమోయి అటులనుచుంటివి?

దేవ—దేవా! యేమంటివి ?

జయ—(కోపముతో) వీనిసాక్ష్యమింకఁ జాలు. తాగుబోతువానివలె పేలుచున్నాఁడు. కొట్టులోఁ బడవేయుఁడు.

శుచిత—(బంటువైపుఁజూచి) వేగమే వీని కారాగృహమందుంచుము.

బంటు—చిత్తము. (అని వానిని దీసికొని పోవుచున్నాఁడు.)

దేవ—అయ్యో! నేనీయబద్ధ సాక్ష్యమిచ్చినందులకు కిదిగానన్ను గొట్టులో బెట్టవలసినదే. (అని బంటుతో నిష్క్రమించుచున్నాఁడు.)

జయ—చాలు. వాదియొక్క సాక్ష్యమవసరము లేకుండఁగనే నిజము తేలినది. వాదియైన చిత్రరేఖను గూడా కొట్టులో బడవేయుఁడు. ప్రతివాదియైన చంద్రమణిని యొక్కసారి పిలిపింపుడు.

శుచిత—(బంటుదెసఁజూచి) చంద్రమణిని తోడ్కొనిరమ్ము.

బంటు—చిత్తము. (అని చంద్రమణితో ప్రవేశించుచున్నాఁడు.)

జయ—అమ్మా! మీకేసు విచారణమైనది. మీరు గెల్చినారు. గాన మీనివాసమున కుంబోండు.

చంద్రి—(విచారముతో) నాయనా! యింక నామందిరము మరలసంద్రిమే?

శుచిత—ఏమమ్మా.

చంద్రి—(విచారముతో)

సీ. సరససన్నుత గణా ♦ సంయుతుండైనట్టి, రత్నపురాధీశు ♦ బాణినయ్యు
బగతుఁడదునిమెడు ♦ బలుఁడగు కంగ్ల, ప్రభునకుగారాబు ♦ భగినినయ్యు

రతనంపు మైకాంతి ♦ రాజిల్లు జయచంద్రి, చంద్రిరేఖలకు నే ♦ జననినయ్యు
పరులను సోదర ♦ భావంబుగా నెంచి, శిరమెత్తి చూడని గరితనయ్యు
తే. గీ. బ్రహ్మవ్రాసినవ్రాతఁ♦దప్పింగవశమె, యొకరియింటనుదాసినై♦ యుంటగాక
నిందలకుఁగూడ బాత్రనైతి ♦ నేమనందు, కట్టా! నాజన్మనింకేలఁ ♦ గాల్పనహహా
దైవమా! ఆనాఁడు దుశ్శీలుఁడు ప్రియునిఁజంపి బిడ్డలను గాననమందుఁ గడతేర్ప
మని యాజ్ఞనొసంగినప్పుడు బ్రతుకుపైరోసి వారాసిలోఁ బడితినిగద. ఏల జాలరి
వాండ్ర చేతిలోఁజిక్కితి. తిరుగ పారావారంబునఁ జొరక నీరాజు నొద్దను శీల
యను నామంబునకు మారుపేరు గల్పించుకొని దాసిగానుంటి. ఛీ. ఇట్టి యిక్కట్టు
లకు లోనగుటకు కాఁబోలు. ఇంక నేమిబ్రతుకు. (అని విచారించు చున్నది.)

జయ—ఏమేమి! మరలనొకసారి యిప్పుడన్న వాక్యంబులు వాక్రుచ్చుము.

చంద్ర—మహారాజా! నేనేమియుఁ దప్పులు వచింపలేదు. నా బ్రతుకును గుఱించి నిం
దించు కొనుచుంటిని.

జయ—అనికాదు. మరల వినవలెనని తాత్పర్యమున్నది.

చంద్ర—(విచారముతో తిరుగ)
"సీ. సరస సద్గుణగణ ♦ సంయుతుఁడగునట్టి,
రత్నపురాధీశు ♦ రాణినయ్యు" [అను పద్యము చదువుచున్నది]

జయ—(సింహాసనమునుండి దిగి తల్లిని గౌఁగలించుకొని)
ఆహా! నా పూర్వపుణ్యసంచితంబు.
మ. వనమధ్యంబున జంపుమందుఁ బరితో ♦ నైశంబ మమ్ముంపఁగా
వనమధ్యంబున నీవు జొచ్చితిగదా ♦ ప్రాణంబులం బాయఁగా
వనమధ్యంబున దైవయోగమున జీ ♦ వంబుల్ విడెన్ బోయికిన్
వనమధ్యంబున నీవు జాలరులచేఁ ♦ బట్టంబడం బుణ్యమా. 2
అదియునుంగాక.
మ. కలనైనన్ నినుజూతు నంచు మదిలోఁ ♦ గాంక్షింప వీలేది యా
జలరాశి న్బడుట న్మము న్నటవిం ♦ జంపంగ నంపించుటల్
దలఁపవ్వచ్చునె యెన్నఁ దైవదిరుగన్ ♦ దర్శించుటొండ న్గకున్
గలుగవ్వచ్చునె యొల్లుదల్చెద మహా ♦ కంసారిమాయల్ గదా.
మంత్రిపుంగవా! మదీయభాగ్యంబు కతనకన్న జననిని గన్నులారఁ గాంచుటగలిగె.
దైవయోగంబునకు నసాధ్యంబు కలదా? ఇదియంతయు మాయగానున్నది. మా చెల్లె
లుకూడ మమ్మును కలసికొనుట యొక్కటి యున్నది.

చంద్ర—కుమారా! చెల్లెలేమయ్యె?

శ్రుత—రాజా! మీయంబ గారని తెలుసుకొన్న తరువాత యిచ్చట నామెను నిల్పుట కర్జంబుగాదు. రండు పోదము.

జయ—మంచిది. (అని యందరు నిష్క్రమించుచున్నారు.)

తే. గీ. పృథ్వి సూరన సూరన ♦ భీమనాఖ్య
సుమతి సీతయార్యులభ్రాత ♦ కొమరుఁడైన
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపైఁ ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## నవమాంకము.

[ప్రదేశము - రత్నగిరి, దుశ్శీలుని కుటిలాలోచన సభ.]

(దుశ్శీలుఁడు, దుశ్చేష్టుఁడు, దుర్బుద్ధి, మతిమంతుఁడు, సత్యసేనుఁడు, జనార్దనసింగు, నారాయణసింగు కూర్చుని యుండఁగా)

దుశ్శీ—జయచంద్రుని యుద్ధవార్తాపత్రిక వారము దినములక్రిందటనే జూచి యుంటిరిగద. ఏమర సన్నాహములు గాక యేలయూరకుంటిరి? మీయూహ లేవియో తెల్పుఁడు.

మతి—రాజా! మీకాగ్రహము వచ్చినను సరేకాని.

ఆ. వె. నిజము దేవుఁడెఱుంగు ♦ నీరు పల్లమెఱుంగు
ననెడు నార్యుపల్కు ♦ లనఘ వినమె
యెన్ని కష్టచయము ♦ లెనయించి నను గాని
తుదకు బాలుఁడు సుఖ ♦ మొందవునుమ్మ. 1

అందుల కుదాహరణము కావలెనంటివా.

తే. గీ. మున్ను దుర్యోధనాధులు ♦ పన్నరారి
పన్నికలు పన్ని యటవుల ♦ పాలుఁ జేయ
పాండువంశజు లేలరే ♦ వసుధయెల్ల
నంచు భారతకథ లెఱిఁ ♦ గించ వినమె. 2

కావున యికనైన నన్యాయపు ప్రవర్తనము మాని, యాతని తండ్రి రాజ్యము యాతని కొసంగుము.

దుశ్శీ—కం. పుట్టినది రాజవంశము, పట్టణము న్నేడవ తాను ♦ బవరంబున నగ్
గిట్టించఁగవలె నంతకు, నిట్టులమిది నమ్ము మింక ♦ నెట్టికశిలా.

సత్య—(స్వగతమున) అదియెంతపని?

నార—నృపా! తే. గీ. పల్కవచ్చు నెన్ని ప్రగ ♦ ల్భ్యములనైనఁ
గష్టమవి చేయు టేలాటి ♦ ఘనులకైన
మున్ను రాజ్యము వీరు గై ♦ కొన్నరీతి
నెఱుఁగమే యిటు పల్కెదో ♦ నృపవరేణ్య. 4

సత్య—పృథ్వీశా! యిటువిను.

చ. కపటముఁ బన్ని రేపడుమ ♦ గాఢముగా నిదురించుచున్న మా
నృపతిని జంపి రాజ్యరమ ♦ నేలితివంతియెగాక యిట్టులీ
శపథ మదేల బాలకుని ♦ సంగర రంగమునం జయింతునం
చిపుడ లుగంగఁ బౌఱుష మ ♦ దేకడ నిల్చెను మున్ను భూవరా. 5

దుశ్శీ—సచివా! ఇంచుక మంచిచెడ్డలు యోచించక వచించుచుంటివి. ఆ ప్రభాకరుండు సకలజన వశీకరుండు, రాజ్యాధిపతి, సకలసైన్యమాతని పట్టయి యుండును. నేను యొంటరిని కావున నర్ధరాత్రింబున నిద్దురఁబోయెడు వానిం బరిమార్పవలసివచ్చె. ఇప్పుడన్ననో యీజయచంద్రుఁడు నేనును సమానముగా పోరాడుటకుఁ దగిన సేన యున్నవారమే కదా.

దుశ్చే—(కోపముతో)

క. ప్రగ్గడకొంచము హెచ్చుం, దగ్గలు లేకిటుల వాడఁ ♦ దగు సేనగరే
సిగ్గల లేకఁ బల్కెద, వెగ్గొనరింపగఁదల్చి ♦ తేమిటి యొక్కో.

జనా—(కోపముతో దుశ్చేష్టునిఁ జూచి)

శా. ఔరా గర్వమదాంధకార యిటు యు ♦ క్తాయుక్తము ల్గానకే
కారుల్ పేర్లేద వేల మాసచివునిం ♦ గానిమ్ము క్రూరాత్మ యీ
సారిం సైరణచేసినాఁడ నిక నీ సా ♦ మంతము న్మాని నీ
నోరన్మూసుక యూరకుండు మిటపై ♦ నోరెత్తినం జూడుమీ. 7

[అని పిడికిలిం గనపరచుచున్నాఁడు]

శూర—(జనార్దనసింగు వైపుఁ జూచి)

ఉ. కూళుఁడు దుర్జనాళి కను ♦ కూలుఁడు కూర్పరుఁడు నోర్వలేక చం
డాల స్వభావముం దెలియ ♦ దంబుగఁ బ్రేలిన నేమి మత్తఖం
డాలము వీథిఁబోవ నెను ♦ దాయుచు నజ్జలుసాచి గ్రామ కా
దూకాలము లెల్ల నేకమయి ♦ రోదనఁ జేసిన గొప్పబోవునే. 8

దుశ్శే—ఓరీ! రాజద్రోహులారా! హీనవంశ సంభూతులారా! మీయిచ్చకు వచ్చిన తెఱంగున మచ్చరంబులుచ్చరించు చుంటిరిదదా. కానిమ్ము సమయమువచ్చు వఱకును మీరాఁడుమాటలకు నోడియొగ్గవలెనె.

(అని వారలవైపు కోపముతోఁ జూచుచున్నాడు.)

నారా—భుజంగప్రయాత. ఒడల్ గట్టకన్మూఢ ♦ యొక్కింతమమ్మా
రొడన్ నీవు నేడిట్టి ♦ యొగ్గల్వచింపన్
దుశ్శే— పొడింజేతు మేమొక్క ♦ మూర్తంబులో
జనా— నీ గడింరమ్ము లేలెమ్ము ♦ కౌటిల్యబుద్ధీ. 9

దుర్బు—ఏల? మీమీక్రోధంబులెల్ల వెల్లడి చేసికొనియెదరు.

దుశ్శే—ఓదురాత్మా! (లేచి) పద్మనాభ వృత్తము.

ఈమారునీలాగు దుర్భాషలంబల్క ♦ నీ రేడులోకంబులం డాగియున్నన్
భూమీశ వాణీశ లక్ష్మీశ గౌరీశ ♦ ముఖ్యుల్ నివారించినం బీఁక ద్రుంతున్

నా—ఛీ మాటకున్మేటి శూరుండవై నిల్చి ♦ చేయంగ సంగ్రామము న్వేగరమ్మా
ఈమాటలేలావృథా ప్రేలుఁ జేలావి ♦ హీనాత్మవాదా ♦ నిజండబాడరాదా.

(అని నిలువఁబడుచున్నాఁడు.)

దుశ్శే—(కత్తి గిరగిరద్రిప్పుచు) అన్నా! దుర్బుద్ధీ!

ఆ. వె. అగ్నిహోత్రిమందు ♦ నాజ్యంబునిడఁ బ్రజ్వ
రిల్లునట్లు నాకు ♦ నుల్లమందు
మీనిపల్కులెల్ల ♦ వేడిమి సేయంగ
పైపఁ జాలనింక ♦ సరగరమ్మ. 11

నారా—ఔరా! ఎంతపోటరివి?

తే. గీ. నీవొకండవెకాకను ♦ నీదుచెల్మి
కానితోడుగాఁ గొన్ప్రోవ ♦ గాలుపురికి
నెంచినాడవు లోకోక్తి ♦ గాంచనిజము
రాచపీన్గొంటిగా జన ♦ దంచు జెపుట. 12

దుర్బు—(కత్తిఁ దీసుకొని పైకిలేచి)

తే. గీ. తలచినంతనె జగమెల్లఁ ♦ గలయద్రిప్పి
దహనశవరింపఁ గలశక్తిఁ ♦ దగిలియున్న
ననలునకు ననిలుఁడు సహా ♦ య మగురీతి
నిర్వ్యరము చేర హరిస్త్యైన ♦ నిల్వఁగలఁడె. 13

జా నా — ఓరీ! మూఢా! నీచకులాధమా!

ఆ. వె. శౌర్యహీనుఁ డీవు ♦ జాలమాటలు పెద్ద
యనెడు నార్యవాక్య ♦ మనృత మగునె
వత్తురేనివీరు ♦ వహ్నిలో నుతికెడు
శలభచయము భంగిఁ ♦ జత్తురిపుడు. 14

(అని కోపముతో ఖడ్గమునుబూని నిలువఁబడుచున్నాఁడు.)

దుర్మ — (దుశ్శీలుడు దుర్బుద్ధులను బట్టుకొని) మిత్రులారా! ఏనిమిత్తకారణముగాఁ బో ట్లాడెదరు? కార్యభంగము కలుగకుండా నెద్దియైనా నాలోచించవలెను.

దుశ్శీ — రాజా! ఆయధముని చెడుమాటలకు నా యెద యెట్లు సైచును.

దుర్బు — నృపశిఖామణీ! పైత్యజ్వరమంకురించిన వానివలె యెడలెఱుంగక నిర్భయ ముగాఁ దుర్భాషలాడుచున్నవాఁడు. ఒక్కసారి నాబాహుబల పరాక్రమము చవిఁ జూచుఁగాక పోనిమ్ము.

(అని విదలించుకొనఁ బోవుచున్నాఁడు.)

సారా — రాజా! రానిమ్ము. రానిమ్ము.

ఆ. వె. ఒడలు మఱువఁజేయు ♦ యున్మత్తజ్వరమది
మాదుముష్టిఘట్ట ♦ మనెడుమాత్ర
తగిలినేని తెగులు ♦ త్వరలోనఁ దగ్గను
దడవుసేయ కింక ♦ విడువు మయ్య. 15

(అని మీఁదికిఁ బోవుచున్నాడు.)

మతి — (నారాయణసింగును బట్టుకొని) మతి భ్రమించినదా యేమి? ఊరకుండుము.

జనా — క. మత్తుడవుగ దూషితదు, శ్చిత్తుఁడ నీ వంతెగాక ♦ చెనటుఁడ జౌరా
యిత్తఱిఁ బ్రేలిన యమపురి కుత్తరు విచ్చెదను వేగఁ ♦ గొనినీశిరమున్

(అని పైఁబడఁ బోవుచున్నాఁడు)

సత్య — (అతనిఁ బట్టుకొని) చాలికాఁడా! పీలనీకలఁత మనము కలగజేసుకొనకుండు నెడ వారిచ్చవచ్చినట్లు పోట్లుపడియెదరు. కూర్చుండుము.

(అని అందఱిని గూర్చుండ బెట్టుచున్నాఁడు.)

దుశ్శీ — ఓయీ! కలహమునువిడచి ముందుసంగతి నాలోచింపుడు.

మతి — ముందుసంగతికేమి? సంగర మొనరించుటకు మాకెంతమాత్రము నిచ్చలేదు.

దుశ్శీ — అటుగాకున్న మనము చేయఁదలచిన పనియేమి?

శల్య—మానవేశా!

ఉ. పట్టినపట్టు వీకన్ ♦ బాలునిపైఁ గదియంగ నెంచితీ
పట్టున మీఁదు పంతమిక ♦ పట్టిది చెల్లుట నాదువాక్యమున్
గట్టిగ నమ్మి యోనృపతి ♦ భామణి పితృని రాజ్యదంపతుల్
పట్టికొసంగి యమ్మహుని ♦ పట్టునఁజేరి సుఖింపు నిచ్చలున్ 17

యిందులకు సమ్మతింపకున్నఁ గయ్యంబునకు నియ్యకొనము.

దుశ్శ—చాలుచాలు. తే. గీ. కసవు మేసెడి పసరంబు ♦ కరణి పరుల
చెంతఁజేరి పౌరుషమును ♦ జెరచి నైచి
మనుటయే మంచిదన బసు ♦ వునకు మనకు
ధరను నెంచంగ పాదభే ♦ దంబు కాదె.

అదికాక, రణంబున ప్రాణంబులు వీడుటొండె లేక గెల్చుటొండె. ఎట్లయిన నుమంచిదే. పురుషునకు పౌరుషమా లేక ప్రాణమా ముఖ్యము? ఏలయిట్టు పలుగాకిమాటలాడెదవు.

దుశ్శే—నృపాలా! ఏల గాలయాపన చేసెదవు. వారిని బ్రతిమాల నవసరము లేదు.

క. దుష్కులము పగవాఁడల, గర్భంబులు చీరి నైచి ♦ క్షితజముపారన్
నిర్భయముగఁ జేసితి మీ, యర్భకుఁడన నెంత మాకు ♦ నాజి నెదుర్పన్

జనా—ఓరిచపలచిత్తా! మాప్రాణంబులు రణంబున వీడుపరకు నాపాపని కించుకయైన నపాయము కలుఁగఁ జేయుము. నీకున్న కక్కసముకోరిఁది వెక్కసంబుగా నుక్కివముతోఁ బల్కుచుంటివి కాని నీకక్కణగించుటకు మాలోనొక్కఁడు చాలు.

దుశ్శే—ఔరా నీవాఁడుమాటలు నాహృదయంబునకుఁ గఱకుటమ్ముల వలెఁ దగిలి కెర్లఁజేయుచున్నవి.

క. క్షితిలోక్షితిపతియానలు, మితివప్పగ రాదటంచు ♦ మి[illegible]యుంటిన్
కతిపయక్షణముల కిందనె, ప్రిథ్వపతి పట్టంబు నీకు ♦ వేశ్మము గాదే.

నారా—ఔనౌను. రాజాజ్ఞ చేతనో నీకున్న పితికితనము చేతనో యూరకుంటివి. లేకున్న నివేకాక నీమిత్రునితోఁ గూడ యమసదనంబున కిదివరకే యరిగియుందువు. చాలుచాలు యికనైన నీతుచ్ఛసంభాషణఁ గట్టిపెట్టి యూరకొమ్ము.

దుశ్శ—నారాయణ!

ఆ. వె. పరుగులెత్తువాని ♦ పడగెంటగాఁ నెంచి
వెంట నంటి తరుము ♦ తుంటరి వలె

యూరకొన్నకొలఁది ♦ నోరెత్తి మమ్ముల
నిష్ఠురంబు లాడ ♦ నేర్చితకట.

మేమేనా యంత నోరుమూలినవారము. నీకన్న నెక్కుడుగాఁ బ్రాగల్భ్యములను జెప్పగలము. ఇకచాలించి మిన్నకుండుఁడు.

నారా—ప్రాగల్భ్యములందు మాకన్న నెక్కువయేకాని (అధోక్తి)

దుర్బు—ఆహా! భుజాబలంబునకు దక్కువయనా, యెంచుచుంటివి?

నారా—ఏదీ చూతము. ఒకసారిరమ్ము.

దుర్బు—ఓరీ నీకృత్యంబులంజూడఁగ

తే. గీ. ప్రేమతోఁ బాలునన్నంబుఁ ♦ బెట్టి పెంచఁ
గడకుఁ గాళ్ళుపీకిన శున ♦ కంబుకరణి
మానృపుని చేతఁ బెరుఁగుచు ♦ మమ్ముగదియఁ
దలఁచి తింటుక సిగ్గవే ♦ తలఁపులేక. 22

నారా—ఏలాగునైనను శునకము విశ్వాసముగు జాతిలోనిదే. నీవన్ననో

తే. గీ. విషధరమునకు పాలిడ ♦ విషమునిచ్చు
భంగిమాపరిభాకరు నృపు ♦ పట్టణమునఁ
జేరి యూఁతని సిరిచేత ♦ జీవనంబుఁ
జేయుచుండి మాకిఁక హానిఁ ♦ జేయఁజూతు. 23

దుశ్చే—ఆహా! మీపరిభాకరుండు స్వర్గారోహణుం డయినాడు.

నారా—ఇకకొంత సేపటికిమీ (అర్థోక్తి.)

జనా—మిత్రమా! యిదియేటిసంభాషణ.

తే. గీ. అల్పజనులకు సంపద ♦ లబ్బె నేని
రహిని యర్థరాత్రిలను ఛ ♦ త్రింబుఁ బట్టు
మని భటులకాజ్ఞనిడినట్లు ♦ మంచిచెడ్డ
లు దెలియునె మూఢమతులగు ♦ లుచ్చెలకును. 24

వారెన్ని ప్రేలినను మనకు లక్ష్యమే. కాఁదలఁచిన కార్యము గంధర్వులేతీర్చిరని నట్టుగా మనమూరకొన్న వారిపాట్లు వారే పడెదరు.

దుర్బు—ఔనౌను. మీరు కలహమునఁ గలుగఁజేసి కొనకుండునెడ రాజ్యము పోవునని పల్కుచుంటిరి. యీపల్కుఁ గాంచగా

తే. గీ. తల్లకిందుల నిల్చి చ ♦ దలు మదీయ
పాదముల్బమునను గాదె ♦ పడకనాగి

యనెడు తీతువట్లతదీయకి ఘనభుజాబ
లంబుచే రాజ్యమూగిన ♦ ట్లాడుచుంటి. 25

(అంతట తెఱలో) దుశ్శీలనృపాలా! మనరత్నగిరిపురము విడుఁడా పరిభవమున పరిభాకరునకు కారాబు కోమమండగు జయచంద్రుఁడు ముట్టడించియున్నవాఁడు వేగసమరసన్నాహముతో రండు రండు.

దుశ్శీ— అమాత్యులారా! సేనాపతులారా! పరిభాకరుని జంపినప్పటికి మిమ్ములను మీ వృత్తులనుండి తొలఁగింపక మీయిష్టానుసారముగాఁ బరివర్తించినాఁడను గదా. ఇదివరకెన్నిమాట లనుకొన్నను గార్యముపచ్చినప్పుడు మనమందఱ మొక్కటిగా నుండవలెను. "ఆడఁబోయిన తీర్థ మెదురయినట్టు" యిచ్చటకే జయచంద్రుఁడు వచ్చియున్నవాఁడు. ఎంతబలాఢ్యునికైనఁ దనతావు విడచి శత్రుస్థానమునకువచ్చి పోరాడి గెలుచుట దుర్ఘటంబుగదా. కావున మీసైన్యములఁగూర్చుకొనిరండు.

మతి—మనుజాధిపా!

ఉ. మేలొనగూర్పఁగాఁదలఁచి ♦ మిక్కిలి బాళిని మీదుచెంతనే
వేళల నిల్లుగట్టుకొని ♦ వేడిన వీనులఁ బెట్టకుండనా
బాలునిమీఁదికింజన ను ♦ పాయము నెంచెఁగ చెప్పవట్టిమా
లాలనపల్కులన్నియు వి ♦ లాసిని కిచ్చిన సొమ్ములయ్యెఁగా. 26

సత్య—రాజా! నీకు నారెడ లాగ్రహము సంభవించినను సరేకాని.

తే. గీ. నాఁడుదశకంఠ దుర్యోధ ♦ నాధులట్లు
నీకు మృత్యువు సమకూరె ♦ లేకయున్న
మాదుపల్కులాలింపవే ♦ ముందునకట
గణకకుసుకథలనుఁ జెప్ప ♦ వినవియటుల. 27

[అంతట తెఱలో]

భూవరా! త్వరగాఁ గదనప్రయత్నమై రమ్ము. జయచంద్రుఁడు పురము మీఁదికి వచ్చుచున్నవాఁడు. జాగుచేసిన హాని రాఁగలదు.

దుశ్శీ—(కోపముతో) ఔరా! యెన్నిసారులు సమరసన్నాహములు గమ్మన్నను నా మాటలు విశ్వసించకుండిరి. ఆనాఁడు మీరాజుతోఁగూడ మిమ్ములను దగటార్చిన నింతపని జరుగకుండును. అయిన నిప్పుడు మించినదేమి?

మ. విలపత్సంపదకాటపట్టయినయా ♦ వింగుళ్ల దేశాధిపు
గ్గలహంబందునఁ బిల్కుమార్చివెసనా ♦ ఖడ్గాన మీకుత్తుకల్
తోలఁగఁజేయకయున్నచో నటుపయి ♦ న్దుశ్శీలుడంచు న్ననుఁ
బిలువంబోకుడి వాదుశబ్ద మికయే ♦ వేల్పడ్డినం దప్పనే. 28

(అని లేచి) రండుమిత్రులారా! (అని నిష్క్రమించుచున్నాఁడు)

దుర్బు—మంచిది (అని లేచి)

తే. గీ. తిన్నయింటికిఁ జేటును ♦ దెమ్పుటయును
నేటిని గడచి తెప్పను ♦ నిప్పిడుటయుఁ
దల్లిని జరిహసింపంగఁ ♦ దలఁచుటయును
భోలె మీకృత్యములసెన్న ♦ కూళలారా. 29

జనా—ఓరీ! తల్లిపుట్టినిల్లు మేనమామకు సెలుక గాకుండునా? యటులనే చిన్నవా టనుండి మీదుర్నడతలు మాకు తెలియున్నట్టే యిప్పుడు వచించుమంటివి. చాలునిక నీనుడులు. నడునడు.

దుర్బు—చాలు లే పరితాపము. (అని నిష్క్రమించు చున్నాఁడు)

దుశ్శే—సభ్యులదెసఁజూచి) మీరలు మీరాజాగారి ప్రతిభవింటిరి గద తరువాతవా యుఃపాదముల పయింబడినను లాభము లేదు.

నారా—ఓరీ! నీవలెనే యనుకుంటివి కాఁబోలు.

ఉ. సందియ మేల నాప్రతిభ ♦ సభ్యులముంగలఁ బల్కుచుంటి నా
బొందినిపీడి ప్రాణములు ♦ పూతికనిబోరెడు వంతదాక యా
నందముఁ డింతయే భయము ♦ నాపదఁ బొందఁగఁ జేయనీవో కో
యందినజుట్టుపట్టుకొను ♦ దండకయుండిన కాళ్ళుపట్టెదా. 20

దుశ్శే—చాలు నీపరితాపము నీవే మెచ్చుకొనవలె « తనకు తాను మెచ్చుకు టెంత (———)

జనా—దుశ్శేష్టా! నీకోసమయి భటులు వచ్చియున్నారు. వేగఁబొమ్ము.

దుశ్శే—(యిటునటుఁ జూచి) ఏరీ! భటులు.

జనా—యమభటులు,

దుశ్శీ — చాలుఁ నీ పెడయుక్తికి సంతసించితి.

(అని తొందరగా నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య — అగ్రిజా! మన మాతురతతోఁ బోయి యా జయచంద్రునిం గలిసికొని కదన మునకుఁ దగిన సదుపాయముఁ జేయుదము.

మతి — మంచిది. (అని నారాయణ జనార్ధన సింగులవైపుఁ జూచి) మిత్రులారా! రండు బోదము (అని నిష్క్రమించుచున్నారు.

తే. గీ. ధరణిహూణాంధ్ర భాషల ♦ సరస తెలిగి
కవితచాతుర్య సంగీత ♦ జవి నెఱుంగు
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

దశమాంకము.

ప్రదేశము–రత్నగిరి, డేరాలసీను, యుద్ధభూమి.

(జయచంద్రుడు, మతిమంత, సత్యసేన, శ్రుతశర్మ, యనుమంతులతోడను, గొంత సైన్యముతోడను, బ్రవేశించుచున్నాడు.)

జయ—(మతిమంత సత్యసేనలను జూచి) సచివాగ్రగణ్యులార! తరువాత నేమి జరిగినది.

మతి—రాజా! యేమున్నది ?

ఉ. ఏటికి మంచిచెడ్డల నో ♦ కించుక యెంచనివానితోడ మా
కేటికి రాయబార మిక ♦ నేటికిఁ జెప్పితి నీతులెన్నొ ము
మ్మాటికి నాదుపంత మిక ♦ మానుట లేదని తానుబట్టు కుం
దేటికి మూడికాళ్ళనుచుఁ ♦ దీటుగఁ బట్టినపట్టు వీడడో. 1

సత్య—నృపవతంస! యాతనికి సంగ్రామమందె ముఖ్యాభిప్రాయమై యున్నది.

శ్రుత—బాలా! యేల యీలీల జేలతనంబు ? అతఁడు మిమ్ములఁ బెట్టిన యిక్కట్టులను దలంచుకొన్న నెంత కఠినహృదయుని కైనను కనికరము పుట్టకమానదు గదా! ఆక్రూరుఁడు రణంబున మరణం బొందవలసినదే. లేకున్నము న దనేక కష్టములఁ బ్రాప్తింపును.

జయ—మంత్రిపుంగవా! యీసంగతి యటుండనిండు. రాజ్యాధిపత్యమును వహించువాఁడు.

సీ. ధైర్యసాహసగుణ ♦ శౌర్యానురక్తుఁడై, మానవతతి నెందు ♦ మనుపవలయు
సకలధర్మాధర్మ ♦ శాస్త్రపద్ధతి నెంచి, యింపుగాఁబ్రజలఁ ♦ బాలింపవలయు
ఆగ్రహానుగ్రహ ♦ నిగ్రహాశక్తుఁడై, తగినవేళలయందుఁ ♦ దాల్చవలయు
యుక్తం బయుక్తంబు ♦ నోలి గ్రహించుచు, మంచిచెడ్డల నాల ♦ కించవలయు
తే. గీ. నయనమున నొక్కసారి రా♦జవనిజనుల, క్షేమములయఁగవలయును♦ప్రేమతోడ
ననుచుదెలిపెడు మీబోటి♦ఘనుల నుడులు, నాలకించుచుమీయంట♦యఘము గాదె.

శుత్రిత—సెబాస్ వత్సా! రూపమునకుఁ జిన్నవాఁడ వైనను బుద్ధికిం బెద్దవాఁడవే.
జయ—కావున మనమీధర్మములు మర్మములు నెఱిఁగి యుండి తప్పొనరింప మనసున
కట్లొప్పిదమగును.
మతి—జనవరా! మీత ప్పేమియున్నది. సాంపరాయమునకు ముందుగా రాయబార
మునకుఁగా జాబంపితిమిగదా.

[తెరలో]

ఓరీ! దుశ్చేష్ట! ఓరీ! దుర్బుద్ధి! గుదితాల్పుపురమునఁ బదిలముగ నుంటిరిగద. (అను
చు రక్తధారాసిక్త దేహులై జనార్దనసింగు నారాయణసింగులు ప్రవేశించుచున్నారు)
జనా—, నారా— } జయచంద్రమహారాజా! సచివేంద్రులారా! నమస్కారములు.
జయ—(నివ్వెఅపాటుతోఁ జూచుచున్నాఁడు)
సత్య—ఓరాజపుత్రా! వారలు మనసేనానాయకులగు, జనార్ధననారాయణసింగులు
మతి—శౌర్యమును తగ్గించి జరిగినపనిఁ దెల్పుఁడు.
నారా—సచివాగ్రణీ! సమరభూమికి నరుగుచుండ దుర్బుద్ధి దుశ్చేష్టులు దారి కడ్డగ
వచ్చి.

ఉ. ఓరి దురాత్ములార వినుఁ ♦ డుక్కడఁగించెద మెందు డాగినం
బోరక నీడ నొప్పుదుమె ♦ పోతరమెక్కి సభాస్థలి న్నృపున్
బీరపు మాటలాడ నొక ♦ పెట్టున మిమ్ము పరిభాకరాఖ్యుతో
దారకఁ జేర్పమే పతి ని ♦ వారణ సేయగ నూరకుంటిమా. 3

అని దుర్బుద్ధిపయిం బడఁ గినిసి.

శా. తన్నుం దాపున కోర్వలేక మదిలోఁ ♦ దాధైర్యము న్వాసియా
పన్నుండై భువి వ్రాలి క్రిమ్మర నను ♦ న్బట్టంగఁ దా లేచినం
గన్నుం ధాత్రిని ద్రోసి పాదమున నుక్కం ♦ ద్రొక్కఁ బ్రాణంబులన్
ఖిన్నుండై పురవిచ్చె మంత్రితనయా ♦ ఖేదంబుతో సచ్చటన్. 4

రైదు పదిజేతునో పది ♦ నైదుజెతో
తెలిసి గొనెదవు నిమిసంబు ♦ నిలువు మిచట. 13

(అని మీాది కలుగుచున్నాఁడు) వనమంజిరి.

జయ— (లేచి) వినుమిక యంజలి వెన్కకు వేయను ♦ వే్రటునం దెగవేసెదన్
దుశ్శీ— పనివడి నీవిట గర్వపుఁ బల్కులు ♦ పల్కఁగా భయమేమొకో
జయ— ఘనమగు నాభుజబాహుల ♦ కడ్డువచ్చిన నిప్పుడే
దుశ్శీ— మనుఁగుట నిక్కువముక్ వన ♦ మాలి శూలియె కానిఁకన్. 14

(అని తత్క్షణమే మీాదికలుగుచున్నాఁడు)

నారా—(ఇద్దరు మధ్య కడ్డువచ్చి)

తే. గీ. నీదు చెల్మికొండు్ర ♦ నీవలె నేను కదా
గొప్పజెప్పి ముండె ♦ కుర్రింగివారు
నీవసంగ నెంత ♦ నిన్ను చిదుముటెంత
కొండ చివరనుండు ♦ బండటాయి. 15

(తెలవెన్క)—ఓరి కులద్రోహీ! పరవనితాపహార! విత్తచోరా! మదోన్మత్తా! నిలు. నిలు. ఇంక యెటకు పోయెదవె.

(అని సుశీలుఁడు చంద్రరేఖతో ప్రవేశించుచున్నాఁడు)

సుశీ— అంబురుహ వృత్తము.

ఓరిదురాత్మ! పరాక్రవిహీన న ♦ హోదరాంతక తస్కరా
బీరపుపల్కులు పలఁగనేటికి ♦ వీరుడంచును వానితో
శూరతనాపయిఁ జూపఁబ యెచ్చట ♦ జొచ్చినం బోరిపుచ్చెదన్
రార ప్రజావళి మెచ్చఁగఁ బంపెద ♦ శార్ఙ్గదేవుని పట్టుకున్. 16

(అని జుట్టుపట్టుకుని నీడ్చుకొనిఁ బోవుచున్నాఁడు)

జనా—(జయచంద్రునితో) రాజా! యీసుశీలవిరాట్టున కేవిధముగన హాని రాకుండఁ గాపాడఁ దలంచినారము కావునఁ బోవుటకు మాకిద్దరకును సెలవొసంగుఁడు.

జయ—మంచిది.

(జనార్దన నారాయణ సింగులు నిష్క్రమించుచున్నారు.)

జయ—(చెల్లెలను కౌఁగలించుకొని ముద్దుబెట్టుకొని) అమ్మా! వచ్చితివా! వచ్చితివా! నిన్నాక్రూర మృగాళికుక్షి కిడితినని విచారించితిని. నిన్నువిడచియే నేగినందులకు నన్నుక్షమింపుము.

చంద్రి—అన్న ! నన్నీవిపినంబున విడచి పోవుట మంచిదా !

జయ—అమ్మా ! నీవా వనమధ్యంబున మూర్ఛవోవ పనవి పనవి జలములకై యేగుచో.

తే. గీ. దారిఁ దప్పి డొంకలలోన ♦ దూరిదూరి
యెట్టకేలకు వింగుర్ల ♦ పట్టణమున
జేరి యచ్చట ప్రజలచేఁ గారవమున
రాజ్యపట్టంబు పూనితి ♦ పూజ్యుఁడగుచు. 18

అతరుణమున నే నిను వెదకుటకయి యనేక వేగులవాండ్ర ననేక యరణ్యంబులకుం బనిచితి. నిన్ను విడవాడుట నాకుఁ బగయా ?

చంద్రి—అన్నా ! నీవు చనిన గొంతసేపఁటికి మూర్ఛఁదెలిసి యనేక విధంబుల శోకించుచుండ నొక బోయచేతఁ జిక్కి మామగారిచేఁ బ్రాణంబులం దక్కించుకొని నిన్నరయుటకై యనేకవనంబులఁ పల్లెలు వెదకుచుండఁ దుదకు నీబంటువలన నే మంచెఱిగిన వారమయి కడుమోద మొంది వింగుర్లకుఁ బోవఁగా నచట వారిచే నమ్మగారు బెస్తవాండ్రచేఁ జిక్కినది మొదలు నీవు సమరసన్నాహుఁడవై యిక్కడకు వచ్చినవఱకు జరగిన యావద్వృత్తాంతము విని యతి తొందరతో నిచ్చటకు వచ్చినారము. అమ్మగారెచ్చట యున్నవారు.

జయ—(బంటునిఁజూచి) ఓరీ ! మాజనని డేరాలోనున్నది. పిల్వుము.

బంటు—చిత్తము. (అని పోయి యామెతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

సుశీ—(చంద్రరేఖను గౌగలించుకొని) అమ్మా ! యెట్లు జీవించితివి ?

చంద్రి—నీవెటులో నేను నటులో.

సుశీ—ఆహా ! దైవమాయ.

తే. గీ. నవ్వరోదన పాలయల్కు ♦ కొ్రివ్వతలకుఁ
వాదిగాగల కృత్యముల్ ♦ నరయ నొక్క
త్రుటినె నెల్లఁ జీవులను పొం ♦ దించు నహహ
శౌరిమాయ లెన్నవశమె ♦ స్థాణుకైన. 19

జయ—(సంతోషముతో) ఆహా ! మన ముగ్వురముఁ జేరి ముచ్చటలాడుకొందుమని మున్నెన్నఁడైనను తలంచితిమా ? అన్న ! అన్న ! పన్నగతల్పుని మాయలన్న చిత్రింబులుగదా.

చంద్రి—అదిగో మామగారు సంతోషస్వాంతులై వచ్చుచున్నారు. దుశ్శీలునిం దునిమి మాయన్నకు రాజ్యమిడుదునన్న ప్రతిని నెరవేర్చినట్లు గన్పట్టుచున్నయది.

జయ—చ. ఎఱుఁగవొ యేణలోచన మృగేంద్రము వ్యాఘ్రము లాదిగా భయం
కరమగు దుష్టజంతువులఁ ♦ గన్గొనినంతనె మీఁదికేగి ని
బ్బరముగ జీల్చి చంపఁగల ♦ బాహుపరాక్రమశాలికిట్టి వా
డెరయఁగ లెక్కయే వెలియ ♦ కక్కట పల్కెద వద్భుతంబుగా.

(అంత సుశీలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుశీల—అన్నా! నమస్కారము.

జయ—మామగారు! వందనము.

చంద్రి—మాతాగ్రజా! తమ వార్ధక్యము వెరవేర్చితిరిగదా!

సుశీ—అమ్మా! దైవ మనుకూలుఁడైనచో యది యెంతపని. అదిగాక

క. ఋణశేషము రణశేషము, ప్రణశేషము శత్రుశేష ♦ పావకశేషం
బనువాటిలో చతుర్థము, క్షణమున నేయక దగదని ♦ జనము లనరొకో.

కావున నట్టిబాధలేకుండ తొలఁగించితిని.

జయచంద్రా! నీకేమి కావలయునో దేవుని ప్రార్థింపుము.

జయ— మంగళ మహాశ్రీ వృత్తము.

తారక విధాత శత ♦ వత్సరము లాయువిడి ♦ బాగుగను విద్యలిడి కావన్
శౌరి ఘనసంపదలు ♦ శాంతము నుదారతను ♦ సఖ్యము నొసంగి దయబ్రోవన్
గౌరిపతి న్యాయమును ♦ గాచి మదమచ్చర వి ♦ కార చెడుబుద్ధులను ద్రోచన్
భూరిమిని వందనము ♦ కోర్కెలలరంగనిదిగో ♦ గొనుము మంగళమహాశ్రీ.

(అని ఆకసమువంకఁ జూచి త్రిమూర్తులకు నమస్కరించుచున్నాఁడు.)

త్రిమూ—తథాస్తు. తథాస్తు. (అనుచున్నారు.)

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల చరణారుణారవింద మరంద తుంద లేందింది
రాయమాన మానసోదార నైనాపురాన్వయ క్షీరనీరాకరరాకాసు
ధాకర బాపనార్య పౌత్రసోమరాట్సు పుత్ర భారద్వాజస
గోత్ర పవిత్ర కాత్యాయనీసూత్ర విచిత్ర సుందరాం
బాగర్భశుక్తిముక్తాఫల విబుధజనవిధేయ
సుందరరామయ నామధేయ ప్రణీ
తంబైన నాటక రాజంబున
దశమాంకము
సంపూర్ణము.

